గేశధమ్మిల్లములు మించుఁ గీలుగంటు
క్రొమ్ముడి యనంగఁ గేశబంధమ్మగు (భవ).16

టీ. నెఱులు, కురులు, వెండ్రుకలు, నెఱకలు- ఈ ౪ ను కేశముల నామములు. కొప్పు,తుఱుము, వేనలి, క్రొవ్వెద [క్రొత్త+వెద, అద్యక్షర శేషంబగు క్రొత్తశబ్దమునకుఁ బర మగుపరుషసరళస్థిరములకు ద్విత్వము గలుగును.]-ఈ ౪ నుస్త్రీలకొప్పునకుఁ బేళ్లు, కీలుగంటు, క్రొమ్ముడి[క్రొత్త +ముడి—చూ-క్రొవ్వెద]-ఈ ౨ ను వెండ్రుకలముడికిఁ బేళ్లు.

తే. నొసలు నెన్నొసల్ నుదురు నెన్నుదు రనంగఁ
దనరు ఫాలంబు చూడిక్కి చూ పనఁగ నొప్పు
నాహ్వయము లీక్షణమునకు నక్షికాఖ్య
లలరుఁ గణ్ గను కన్ను నా (నభ్రికేశ). 17

టీ. నొసలు, నెన్నొసలు,నుదురు, నెన్నుదురు-ఇవి ౪ ను ఫాలభాగమునకుఁ బేళ్లు. చూడికి. ప. చూడిక్కి, [చూచుధాతువుకృదం.] చూపు-ఈ ౨ ను చూచుటకు బేళ్లు. కణ్, కను, కన్ను-ఈ 3 ను నేత్రములకుఁ బేళ్లు.

క. వీను లనఁ జెవు లనంగా
జానుగు లన నాహ్వయములు శ్రవణంబులకున్
గౌ నన నడు మనఁగా నభి
ధానము లగు మధ్యమునకుఁ (దరుణేందుధరా) 18

టీ. వీను, చెవి, జానుగు-ఈ 3 ను చెవులకునామములు. కౌను, నడుము-ఈ ౨ ను నడుమునకుఁ బేళ్లు.

తే. అక్కు ఱొమ్మెద బోర నా నలరు వక్ష
మాస్యమున కొప్పుచుండు నాఖ్యలు మొగంబు
మోర మో మనఁ బేళ్లొప్పు నూరువునకుఁ
బెందొడ యనంగఁ గుఱువు నా (నందివాహ) 19

టీ. అక్కు, తొమ్మి, ఎద, [హృదయము-వికృ. ఎద]*, బోరఱొరను వక్షస్థలమునకుఁ బేళ్లు. మొగంబు, [ముఖశబ్దభవము] మోర, మోము [ముఖము-వికృ. మోము]-ఈ ౩ ను ముఖమునకుఁ బేరులు, పెందొడ, కుఱువు-ఈ ౨ ను ఊరువునకు నామములు.

తే. వదనగుహా యొప్పు నోరు నా వాయి యనఁగఁ
బల్లు పలు నాఁగ దంతంబు పేళ్లు నెలయుఁ
బెదవి వాతెఱ మోవి యన్పేళ్లఁ దనరు
చుండు నోష్ఠంబు [శీతాంశుఖండమౌళి]. 20

టీ. నోరు, వాయి-ఈ ౨ ను నోటిరంధ్రమునకుఁ బేరులు. పల్లు, పలు-ఈ ౨ ను దంతనామములు, పెదవి, వాతెఱ, మోవి- ఈ ౩ ను ఓష్ఠమునకు నామములు.

క. కయి యనఁ గై నాఁ గేలనఁ
జెయి యనఁ జై నాఁగఁ జెయ్యి చే హాహస్త
హ్వాయము లగు (నన్నపూర్ణా
ప్రియవల్లభ కాశికాపురీవరనిలయా). 21

టీ. కయి, కై, కేలు, [కేలు-నిత్యైకవచనాంతము.] చెయి, చై, చెయ్యి, చే-ఈ ౭ ను హస్తములు.

క. ఎద యన డెందం బనఁగా
మది యనఁగా నెడఁ దనంగ మఱి యుల్లము నా
హృదయమునకు నివి యొసఁగును
విదితంబుగ నాహ్వాయములు (విశ్వాధిపతీ). 22

టీ. ఎద, డెందము, మది, [మతిశబ్దభవము.] ఎడఁద-పా, ఎద, [హృదయశబ్దభవము.] ఉల్లము-ఈ ౫ ను మనస్సునకుఁ బేర్లు.

క. లోఁజెయ్యన నఱచెయ్యనఁ
గాఁ జెల్లును బేళ్ళు రెండు కరతలమునకున్
మీఁజెయ్యన బెడచెయ్యియు
నాఁ జనుఁ గరచరమభాగ నామములు (శివా). 23

టీ. లోఁజెయ్యి=చేతియొక్క-లోపలిభాగము, అఱజెయ్యి = లోపలి చెయ్యి-ఈ ౨ ను అఱచేతికిఁ బేరులు. మీఁజెయ్యి=చేతియొక్క-మీఁదిభాగము, (మీఁదు+చెయ్యి=మీఁజెయ్యి) పెడచెయ్యి=చేతికివెనుకటిభాగము-ఈ ౨ ను హస్తముయొక్క- వెనుకటిభాగమునకుఁ బేరులు.

ఆ. పొట్ట డొక్క కడుపు బొజ్జ బొట్ట యనంగ
నొప్పుచుండు నాఖ్య లుదరమునకు
నాభిబిలమునకును నామధేయము లగు
బొడ్డు నాఁగ మఱియుఁ బొక్కిలనఁగ 24

టీ. పొట్ట, డొక్క, కడుపు, బొజ్జ, బొట్ట-ఈ ౫ ఉదరమునకుఁ బేళ్ళు, బొడ్డు, పొక్కిలి-ఈ ౨ ను నాభికిఁ బేళ్ళు.

తే. వెన్ను నంగను వీఁపు నా వెనుకమేను
నాఁగఁ జరమాంగమున కొప్పు నామములుగఁ
బుఱ్ఱె తలపాల నాఁ బునుక పుఱియ నాఁగఁ
ఫాలమున కాఖ్య లై యొప్పు (ఫాలనేత్ర.) 25

టీ. వెన్ను, వీఁపు వెనుకమేను=శరీరముయొక్క- వెనుకటిభాగము-ఈ ౩ ను వీఁపునకుఁ బేరులు, పుఱ్ఱె, తలపాల, పునుక, పుఱియ,- ఈ ౪ ను కపాలమునకుఁబేళ్ళు.

క. అడు గంజ హజ్జ యనఁగాఁ
బుడమిఁ బదంబునకు నామములు విలసిల్లున్

మెడ కుత్తు కబ్బు గొంతన
వడరు గళంబునకుఁ బే (శ్రీకనంగధ్వంసీ). 26

టీ. అడుగు, అంజ, పాజ్జ—ఈ ౩ ను పాదమునకుఁ బేర్లు. మెడ, కుత్తుక, అబ్బు, గొంతు—ఈ ౪ ను గొంతునకుఁ బేర్లు.

ఆ. బువ్వ నంటకంబు బోనంబు మెతుకు కూ
డోగిరము పసాద మోరె మనఁగ
నన్న మొప్పుఁ జేల మలరుఁ బుట్టంబు దు
వ్వలువ చీర కోక వలువ యనఁగ. 27

టీ. బువ్వ, నంటకము, బోనము, మెతుకు, కూడు, ఓగిరము, పసాదము, ఓరెము—ఈ ౯ యును అన్నమునకు నామములు. పుట్టము, దువ్వలువ చీరె—పా, చీరె, కోక, వలువ—ఈ ౫ ను వస్త్రమునకు నామములు.

తే. మెసవె నారోగిణమొనర్చె మెక్కెఁ దినియెఁ
గుడిచె నారగించెను బసాపడియె నమలె
సాపడె ననంగ నొప్పు భోజనము సేసె
ననుట కివి యాఖ్యలై (యాశ యభ్రకేశ) 28

టీ. మెసవెను—పా. మెసఁగెను, ఆరోగిణమొనర్చెను—పా. ఆరోగణ మొనర్చెను, మెక్కెను, తినియెను, కుడిచెను, ఆరగించెను, పసాపడియెను, నమలెను. సాపడెను—ఈ ౧౦ యును భోజనముచేసె ననుటకుఁ బేర్లు.

క. నాన యన సిగ్గు సిబ్బితి
నా నివి వ్రీడాపదంబు నామంబు లగుం
బానము సేయుటపేళ్ళగు
నానుట త్రావుటనఁ ద్రాగుటనఁ గ్రోలుటనన్ 29

టీ. నాన, సిగ్గు, సిబ్బితి—ఈ ౩ ను లజ్జకుఁ బేర్లు. ఆనుట, త్రాగుట; త్రావుట, క్రోలుట [ఈ నాలుగును భావార్థకములు.] ఈ ౪ ను మద్యాది ద్రవ్యములఁ బానము సేయుటకుఁ బేర్లు.

ఆ. తళియ పళ్ళెరంబు § తెలె హరివాణంబు
తట్టి కంచ మనఁగ § దనరుఁ బాత్ర
చెల్లుఁ జషకమునకుఁ § బేళ్లు డబ్బర కోర
గిన్నె యనఁగ (రజత§గిరినివాస). 30

టీ. తళియ, పళ్ళెరము, తెలె, హరివాణము, తట్టి, కంచము-ఈ ౬ ను భోజనపాత్రమునకుఁ బేర్లు. డబ్బర, కోర, గిన్నె-ఈ ౩ ను పానపాత్రమునకుఁ బేర్లు.

తే. నతికిఁ బేళ్ళొప్పు జోత దం§డము జోహారు
మ్రొక్కు సేసే యనంగఁ గే§ల్మొగిచెఁ గొలిచె
నెఱఁగెఁ జేమోడ్చె నన నమ§స్కృతి యొనర్చె
ననుట కివి యాఖ్యలగు (నీశ§యభ్రకేశ). 31

టీ. జోత, దండము, జోహారు, మ్రొక్కు, సేసే-ఈ ౫ ను నమస్కారమునకుఁ బేర్లు. కెల్మొగిచెన్=చేతులు జోడించెను, కొలిచెను-ఎఱఁగెన్-పా. ఎరఁగెన్, చేమోడ్చెను=చేతులుజోడించెను-ఈ ౪ ను నమస్కారము చేసె ననుటకుఁ బేర్లు.

తే. ఒప్పు శయనించుటకును బ§న్నుండెఁ బండెఁ
బవ్వడించెఁ బరుండెను § బవ్వళించె
నత్తమిల్లెనన న్మఱి § మెత్త సెజ్జ
పఱుపు పాన్పనఁ దగు శయ్య § (ఫాలనేత్ర). 32

టీ. పన్నుండెను, పండెను, పవ్వడించెను, పరుండెను, పవ్వళించెను, అత్తమిల్లెను-ఈ ౬ ను శయనించె ననుటకుఁ బేర్లు. మెత్త, సెజ్జ, [శయ్యా-వికృ సెజ్జ] పఱుపు; పాన్పు-ఈ ౪ ను శయ్యకుఁ బేర్లుఁ.

తే. ఒప్పు ధ్వనికిఁ బేళ్ళు రొద యన § నులివు నాఁగ
సద్దనంగను గూఁతనాఁ § జప్పు డనఁగ

నలుకుడన రోదనము సేసె ♦ ననుట కాఖ్య.
లెసఁగు నఱచెను వాపోయె ♦ నేడ్చె ననఁగ. 33

టీ. రొద, ఉలిపు, సద్దు, [శబ్దశబ్దవికృతి.] కూఁత, చప్పుడు, అలుకుడు-ఈ ౬ను శబ్దమునకుఁ బేరులు. అఱచెను, వాపోయెను, ఏడ్చెను-ఈ ౩ను రోదనము చేసె ననుటకుఁ బేరులు.

క. అగుఁ బేళ్ళు నీరువట్టన
దగ దప్పియు దూప యనఁగ ♦ దాహంబునకున్
నగవు నగు నవ్వు నవు నా
నగు నాఖ్యలు హాసమునకు ♦ (నగజాధీశా). 34

టీ. నీరువట్టు, దగ, దప్పి, దూప-ఈ ౪ ను దాహమునకుఁ బేరులు. నగవు- నగు, నవ్వు-ఈ ౪ ను హాసమునకుఁ బేరులు.

క. చాగము నాఁ బుడుకు కనఁగా
నీగి యనఁగ నిడుట యనఁగ ♦ నీవి యనంగాఁ
దేగము నాఁ బెట్టుడు నాఁ
ద్యాగమునకు నాఖ్య లగుచు♦ధరఁబరఁగు(శివా.) 35

టీ. చాగము, పుడుకు, ఈగి. [ఇచ్ఛధా. కృ] ఇడుట, [ఇచ్ఛధా. భావార్థకము.] ఈవి, తేగము, [త్యాగశబ్దభవము.] పెట్టుడు-ఈ ౭ ను దానమునకుఁ బేరులు.

ఆ. ఎలసె బెరసె హత్తె ♦ నెనసె నదికెఁ జెందె
బొందె దొరసెఁ గూడె ♦ నొందె జెనకె
ననఁగ సక్తమయ్యె ♦ ననుటకు నివి యాఖ్య
లగు (గిరీశ యీశ ♦ యభ్రకేశ). 36

టీ. ఎలసెన్, బెరసెన్, హత్తెన్, ఎనసెన్, అదికెన్, చెందెన్, పొందెన్, దొరసెన్, కూడెన్, ఒందెన్, చెనకెన్ - ఈ ౧౧ను కలిసి కొనె ననుటకుఁ బేళ్లు.

ఆ. ఎడసెఁ బాసె వేఱు పడెఁ బురివిచ్చె నా
నలరు భేద మయ్యె ననుట పేళ్ళు
స్వవశ మయ్యె ననుట కవుఁ బేళ్ళు లోనయ్యె
నగ్గమయ్యె ననఁగ (ననమనేత్ర). 37

టీ. ఎడసెను, పాసెను, వేఱుపడెను, పురివిచ్చెను-ఈ ४ను వియోగమయ్యె ననుటకుఁ బేరులు. లోనయ్యెను, అగ్గమయ్యెను-ఈ ౨ను స్వాధీనపడె ననుటకుఁ బేళ్ళు.

ఆ. అగు గృహీతమయ్యె ననుటకుఁ బేళ్ళగ
పడియెఁ జేపడియెను బట్టువడియెఁ
జిక్కువడియెఁ దగిలెఁ జిక్కెఁ దగుల్పడె
ననఁగ (నగనివేశ యభ్రకేశ). 38

టీ. అగపడియెను(అగ్గము+పడియెను)=అధీనమయ్యెను, చేపడియెను(చే+పడియెను)=చేతజిక్కెను, పట్టుపడియెను=పట్టుజిక్కెను, చిక్కువడియెను, తగిలెను, చిక్కెను, తగుల్పడెను ఈ ౭యును గృహీతమయ్యె ననుటకుఁ బేరులు.

తే. అనియె నొడవె వక్కాణించె నాడెఁ జెప్పె
వినిచె వాక్రుచ్చెఁ బలికె నాఁ జను వచించె
ననుట లాలించె నాలకిం చెను వినె నని
నలరు నవధరించె నటంట శాఖ్య (లీశ). 39

టీ. అనియెను, నొడివెను, వక్కాణించెను, ఆడెను, చెప్పెను, వినిచెను, వాక్రుచ్చెను, పలికెను-ఈ౮యును చెప్పె ననుటకుఁ బర్యాయములు, ఆలించెను, ఆలకించెను, వినెను-ఈ ౩ను అవధరించె ననుటకుఁ బేరులు.

క. కనియెను చూచెను కాంచెను
కనుఁగొనెఁ గన్గొనె ననంగఁ గలయవి పేళ్లై

చను వీక్షించె నటంట్రు

(ఘనతరగోత్రాజగమన । రాయుజదమనా) 40

టీ. కనియెను, చూచెను, కాంచెను, కనుఁగొనెను, కన్గొనెను-ఈ ౫ను దర్శించె ననుటకుఁ బేర్లు.

క. చనుఁ గృతగమనుఁడ నయ్యెద

ననుటకు నామంబు లగుచు । నవని నరిగెదన్

జనియెదఁ బోయెద నేగెద

వనివినియెద ననెడునట్టి । పలుకులు (రుద్రా) 41

టీ. అరిగెను, చనియెను, పోయెను, ఏగెను, పనివినియెను-ఈ ౫ను బయలుదేఱె ననుటకుఁ బేర్లు.

ఆ. ద్విగుణమున కభిఖ్య । లగు నిబ్బ డిమ్మడి

జంట దంట దుగయు । జమిలి రెట్ట

యినుమడి యన మిథున । మున కాఖ్య లగు జోడు

దోయి కవ యనంగ । (ధూతకలుష) 42

టీ. ఇబ్బడి, ఇమ్మడి, జంట, దంట, దుగ, జమిలి, రెట్టి-పా-రెంట, ఇనుమడి-ఈ ౮యు రెండింతలకుఁ బేర్లు. జోడు, దోయి, కవ-ఈ ౩ను మిథునమునకుఁ బేర్లు.

సీ. ఒండొక్కఁ డొకటి యొ । క్కండన నగు నేక

మీరు రెండిరు నాఁగ । నెసఁగు ద్వయము

తిగ మూఁడు మూర్నాఁగఁ । దగు త్రయి తీవంచ

నలు నాల్గు చౌ యన । నగుఁ జతుష్క-

మొసఁగుఁ జౌవంచ యై । దే ననఁ బంచకం

బా ఆరు మూఁడి తి । గనగ నొప్పు

షట్కంబు ఋషిసంఖ్య కి సత చక్కవగడ యే
డన నొప్పు సప్తసం కి ఖ్యకును బేళ్ళు

తే. దనరు నిరునాలు నెనిమిది కి దచ్చి యనఁగఁ
బరఁగు నీరాఱు పండ్రెండు కి బార యనఁగఁ
ద్వాదశమునకు నాఖ్యలు కి ధరణియందు
(వినుతకరుణాసనాథ శ్రీ కి విశ్వనాథ) 43

టీ. ఒంటు, ఒక్కండు, ఒకటి, ఒక్కండు-ఈ ౪ ను ఏకసంఖ్యకు నామములు, ఈరు, రెండు, ఇరు-ఈ ౩ను ద్వయమునకుఁ బేరులు. తిగ, మూఁడు, మూరు-త్రితయమునకుఁ బేర్లు, తీవంచ=మూఁడునొక్కటియు, నలు, నాలుగు, చౌ - ౪ను నాలుగునకుఁ బేర్లు. చౌవంచ=నాలుగు నొక్కటియు, ఐదు-రూ. అయిదు, ఏను-ఈ౭ను పంచసంఖ్యానామములు. ఆఱు, ఇరుమూఁడు=రెండుమూఁడులు, ఇత్తిగ=[ఇరు+తిగ=ఇత్తిగ] రెండు మూఁడులు - ఈ ౩ను షట్సంఖ్యానామములు, సత (సప్తశబ్దభవము.) చక్కవగడ=ఆఱు నొకటియు, ఏడు-ఈ ౩ను సప్తసంఖ్యకుఁ బేరులు, ఇరు నాలుగు=రెండునాలుగు, ఎనిమిది దచ్చి-ఈ ౩ ను అష్ట సంఖ్యకుఁ బేరులు, ఈ రాఱు=రెండాఱులు, పండ్రెండు, బార-ఈ ౩ను ద్వాదశ సంఖ్యకుఁ బేరులు.

తే. జరిగె నూడెను జాఱెను కి నుఱికె వెళ్ళెఁ
బాఱెఁ బఱచెను దొలఁగె న కి ప్పలుకు లెల్ల
నవనిలోనఁ బలాయితం కి బఖ్యె నసుట
కాఖ్యలై యొప్పు (జంద్ర రే కి ఖావతంస) 44

టీ. జరిగెను. ఊడెను, జాఱెను, ఉఱికెను, వెళ్ళెను, పాఱెను, పఱచెను, తొలఁగెను-ఈలాయుఁ బరుగెత్తి ననుటకుఁ బేర్లు.

క. వేంచేసెను వచ్చెం జను
డెంచెను విచ్చేసె నరుగు కి డెంచె ననఁగ నే

తెంచె నన నయ్యె నాగతుఁ
డంచుం బలుకుటకు నాఖ్య | (లంబరకేశా). 45

టీ. వేంచేసెను,వచ్చెను, చనుదెంచెను(చను+తెంచెను),విచ్చేసెను, అరుగుదెంచెను-రూ. అరుదెంచెను, ఏతెంచెను-పా. ఏగుదెంచెను-ఈ౮ను ఆగతుఁడయ్యెననుటకుఁ బేర్లు.

తే. నాఁటిసుత నాఁటినుండియు | నాఁటఁగోలె
నాఁటఁబట్టి నాఁడు మొదలు | నాఁగ నాహ్వ
యమ్ము లయ్యెఁ దదాగభ్య | యనుట కవని
(వినుతకరుణాసనాథ శ్రీ | విశ్వనాథ). 46

టీ. నాఁటిసుత, నాఁటినుండి, నాఁటఁగోలె, నాఁటఁబట్టి, నాఁడు మొదలు-ఈ౫ను, ఆదిమొదలు=ఆదినమునుండి యనుటకుఁ బేర్లు.

తే. వైరమునకును ధర సహా | హ్వయము లమరుఁ
గంటు పగ మచ్చరంబు సూ | డొంటమి యన
వలపు కూరిమి మేలు నా | నలరుఁ బేళ్ళు
మోహమునకును (శారదాం | బుదనిభాంగ). 47

టీ. కంటు, పగ, మచ్చరము.(మత్సరశబ్దభవము.)సూడు,ఒంటమి-ఈ౫ను విరోధమునకుఁ బేర్లు. వలపు, (వలచుధాతువు కృదంతము.)కూరిమి-రూ. కూర్మి, మేలు-ఈ౩ను మోహమునకుఁ బేర్లు.

క. పెనఁకువ జగడము కయ్యం
బని బవరము కలను చివ్వ | యాలము పోట్లా
టన దురము పోరు నాఁగాఁ
జను యుద్ధంబునకుఁ బేళ్ళు | [చంద్రార్ధధరా]. 48

టీ. పెనఁకువ,(పెనఁగు-కృదం.)జగడము, కయ్యము.(కలహశబ్ద భవము.)ఆని,బవరము,కలను,చివ్వ,ఆలము,పోట్లాట, (పోట్లాడు-కృదం.) దురము, పోరు—ఈ ౧౧ ను యుద్ధమునకుఁ బేరులు.

ఆ. సదమదంబు సేసెఁ । జక్కాడె నుగ్గాడెఁ
జదిపెఁ బీఁచమడఁచెఁ । జంపెఁ గెడపె
నుఱుముసేసెఁ ద్రుంచెఁ । బరిమార్చె దెగటార్చె
మన్నిగొనియెఁ దునిమె । మడిపె ననఁగ. 49

తే. హతము గావించె ననుటకు । నాఖ్య లయ్యె
మనిపె నేలెను బ్రతికించె । మంచెఁ బ్రోచె
సాఁకె నన నొప్పు నాఖ్యలు । సరవితోడ
నరయఁ బోషించె ననుటకు । [వంబికేశ]. 50

టీ. సదమదంబు సేసె, చక్కాడె, నుగ్గాడెను, చదిపెను, పీఁచమడఁచెను, చంపెను, కెడపెను, నుఱుముచేసెను, త్రుంచెను, తెగటార్చెను. మన్నిగొనియెను, తునిమెను, మడిపెను—ఈ ౧౪ ను సంహరించెననుటకుఁ బేళ్లు. మనిపెను, ఏలెను, బ్రతికించెను,మంచెను,ప్రోచెను,సాఁకెను-ఈ౬ను రక్షించెననుటకుఁ బేళ్ళు.

క.. ధరలో శూరాహ్వయములు
వరఁగున్ మొనకాఁ డనంగ । బంటనఁగాఁ బో
టరియన వడిగలవాఁ డన
బిరు దన వాఁడిమగఁ డనఁగ । [భీమకవర్ద్ధి]. 51

టీ. మొనకాఁడు, బంటు,(భటశబ్దభవము.)పోటరి(పోటు+అరి)= శౌర్యముగలవాఁడు, (మత్వర్థమందు 'అరి' యగు.)వడిగలవాఁడు బిరుదు, వాఁడిమగఁడు-ఈ ౬ ను శూరునికి బేళ్ళు.

తే. బాసట యనంగఁ దోడ్పాటు ✽ నా నమాహ్వ
యంబు లగుచుండు రెండు సా ✽ హాయ్యమునకు
నాఖ్యలు శుభంబునకు ల ✽ గ్గనఁగ బా గ
నంగ మే లన లెస్స య ✽ నంగ [నిశ]. 52

టీ. బాసట, తోడ్పాటు-ఈ ౨ను సాహాయ్యమునకుఁ బేళ్ళు. లగ్గు బాగు, మేలు, లెస్స-ఈ ౪ ను క్షేమమునకుఁ బేళ్ళు.

ఆ. కూలె నీల్గెఁ జచ్చెఁ ✽ గాలంబు సేసెను
గెడసె సమసె నాఱె ✽ మడిసెఁ జెల్లెఁ
బెద్దనిదురవోయె ✽ బిద్దె దోరెను గంతు
గొనియె ననుటపేళ్ళ ✽ గును మృతునకు. 53

టీ. కూలెను, నీల్గెను, చచ్చెను, కాలంబుచేసెను, కెడసెను, సమసెను, ఆఱెను, మడిసెను, చెల్లెను, పెద్దనిదురపోయెను, బిద్దెను, దోరెను, గంతు గొనియెను-ఈ ౧౩ ను మృతినొందె ననుటకుఁ బేరులు.

సీ. తిమ్మనైనది యనఁ ✽ దిన్ననైనది యన
జాణైన దనఁగ బా ✽ గైన దనఁగ
నాణెమైన దన వి ✽ న్నాణమైనది యన
మానైన దనఁగ లె ✽ స్సైన దనఁగ
బిన్ననైనది యనఁ ✽ జెన్నైన దన నలు
వైనది యనఁగఁ జె ✽ లువైన దనఁగఁ
బొనరినయది యన ✽ నొనరిన దనఁగఁ జొ
క్కటమైన దనఁగ జ ✽ క్కని దనంగ
సొబగైన దనఁగను ✽ సొంపైన దనఁ గొమ
రైనది యన గొన ✽ బైన దనఁగఁ

దోరమైన దన సిం ౾ గారమైనది యన
మేలైన దనఁగ ౾ మెచ్చైన దనఁగ
తే. మురువుగలయది యొప్పైన ౾ దొఱపుగలది
యందమైనది తనరిన ౾ దలరినట్టి
దనఁగ బరఁగిన దనఁ బేళ్ళు ౾ తనరుచుండు
మంజులం బైన దనుటలు ౾ (మదనదమన). 54

టీ. తిమ్మనైనది, తిన్ననైనది,జానైనది,బాగైనది,నాణెమైనది,విన్నాణమైనది,మానైనది, లెస్సైనది, పిన్ననైనది, చెన్నైనది,నలువైనది,చెల్వైనది, పొనరినయది, ఒనరినది, చొక్కాటమైనది,చక్కనిది,సొబగైనది, సొంపైనది, కొమరైనది, గొనబైనది,తోరమైనది, సింగారమైనది, మేలైనది, మెచ్చైనది, మురువుగలయది, ఒప్పైనది, ఒఱపుగలది, అందమైనది, తనరినది, అలరినట్టిది, పరఁగినది-ఈ ౩౦ యు సౌందర్యము గలదానికిఁ బేరులు

తే. కపుర మనఁ గప్పురం బనఁ ౾ గప్ర మనఁగఁ
బుడమిఁ గర్పూర మొప్పుఁ దాం ౾ బూల మొప్పు
వీడియము వక్కలాకులు ౾ విడెము తమ్మ
లంబు వీడెంబు వీడ్య మ ౾ నం (బురారి). 55

టీ. కపురము, కప్పురము,కప్రము-ఈ౩ను కర్పూరమునకుఁబేళ్ళు. వీడియము—రూ. విడియము, వక్కలాకులు,విడెము, తమ్మలము,వీడెంబు, వీడ్యము-ఈ ౬ను తాంబూలమునకుఁ బేరులు.

తే. వెలయుచుండును సిరి లచ్చి ౾ కలిమి యనెడు
పేళ్ళ సంపద యొద్దడి ౾ పేదఱికము
లేమి నిప్పచ్చరము సెవ్వ ౾ లేమి డనఁగ
నలరు దారిద్ర్యమునకు నా ౾ ఖ్యలు (గిరీశ). 56

టీ. సిరి. [శ్రీశబ్దభవము.] ఐచ్చి, కలిమి-ఈ ౩ ను సంపదకుఁబేరులు. ఎద్దడి, పేదఱికము, లేమి, నిప్పచ్చరము, నెవ్వ, లేమిడి-ఈ ౬ను దారిద్ర్యమునకుఁ బేరులు.

తే. మగతనం బన గం డన § మగఁటిమి యనఁ
బౌరుషంబున కాఖ్య లై § పరఁగుచుండు
నుక్కు చేగ దిటము చేవ § యుదుటు గట్టి
దిట్ట ముఱిది బిగువు నాఁగ § ధృతికిఁ బేళ్ళు. 57

టీ. మగతనము, గండు, మగఁటిమి-ఈ ౩ ను పౌరుషమునకుఁబేరులు. ఉక్కు, చేగ, దిటము. చేవ, ఉదుటు, గట్టి, దిట్టము, ఉఱిది, బిగువు-ఈ ౯ యు ధైర్యమునకుఁ బేరులు.

తే. బద్ధు నా బొంకు నాఁగ ద § బ్బర యనంగఁ
గల్ల నాఁగ హాళక్కి నాఁ § జెల్లుఁ బేళ్ళు
ధర నసత్యమునకును స § త్యంబు పరఁగు
నిజ మనఁగ నిక్కువం బన § నిక్క మనఁగ. 58

టీ. బద్దు, బొంకు, దబ్బర, కల్ల, హాళక్కి-ఈ ౫ ను అసత్యమునకుఁ బేరులు. నిజము, నిక్కువము, నిక్కము-ఈ ౩ ను సత్యమునకుఁ బేరులు.

క. బెడఁద దెస చేటు చేడ్పా
ట్గొడ వాత్రం బంగలార్పు § గోరంబు దొసం
గిడుమ వెత కస్తి యంగద
కడగండ్లనఁ జను విపత్తు § (గౌరీరమణా). 59

టీ. బెడఁద, దెస, చేటు, చేడ్పాటు, గొడవ, ఆత్రము, అంగలార్పు,[అంగలార్చుధా. కృ.] గోరము,[ఘోరశబ్దభవము] దొసంగు, ఇడుమ, వెత, కస్తి, అంగద, కడగండ్లు[ఈశబ్దము నిత్యబహువచనాంతము,]-ఈ ౧౪ ను ఆపదకుఁ బేరులు.

క. వెల జట్టి విలువ రో యనఁ
గలనుడువులు దనరుచుండు క్రయనామము లౌ
వెలయంగ వంగసము నాఁ
గొల మన వంగడము నాఁగఁ గులమొప్పు (శివా.) 60

టీ. వెల, జట్టి, విలువ రో[రై గ్లౌ శబ్దముల కోత్వంబు విభాషనగు. బా. తత్స. సూ. 64.] ఈ ౪ ను క్రయమునకుఁ బేరులు. వంగసము, కొలము, [ప్రకృతి-కులము.] వంగడము-[ఇదియు, వంగసమును వంశ శబ్దభవములు.] ఈ ౩ ను కులమునకుఁ బేరులు.

క. క్రమ్మఱ నెప్పటి వెండియుఁ
గ్రమ్మఱి తిరుగన్ మఱి మఱల మగుడను నా
నిమ్మహిఁ బునఃపదంబున
కిమ్ముల నివియాఖ్య లగు (మహీధరచాపా) 61

టీ. క్రమ్మఱన్. నెప్పటి, వెండియున్, క్రమ్మఱి, తిరుగన్, మఱి, మరలను, మగుడను-ఈ ౮ యు ఇంకను అనునర్థము గలవి.

క. ఒకమరి యొకపరి యొకమా
టొకసా రొకతేప యనఁగ నొకపా రనఁగా
నొకవిడుత యొక్కతూ కన
నొకతడవ యనంగ మఱియు నొకతూరి యనన్. 62

తే. ఏకవారం బనుట కొప్పు నిన్ని పేళ్ళు
జగతి, బల్మాఱు వేమాఱు సారె పెక్కు-
మాఱు లెన్నేనిమార్లనఁ బరగు నాఖ్య
లగుచు నివి బహువారంబు లనుట (కీశ)! 63

టీ. ఒకమరి, ఒకపరి, ఒకమాటు, ఒకసారి, ఒకతేప, ఒకసారి, ఒక విడుత, ఒకతూకు, ఒకతడవ, ఒకతూరి - ఈ ౧౦ యు ఏకపర్యాయమను

టకుఁ బేరులు. పల్మాఱు-రూ. పలుమఱు, పలుమాఱు వేమాఱు, సారె, పెక్కుమాఱులు, ఎన్నేనిమాఱులు-ఈ 4 ను మాటిమాటికి ననుటకుఁ బర్యాయములు.

తే. త్వరితమున కొప్పుఁ జేళ్ళు చె ౯ చ్చెరను సరగ
వేగిరము వేగ వేళము ౯ వెసను వడిగ
గ్రక్కునను గ్రద్దన ననంగఁ ౯ గ్రన్న ననఁగ
గొబ్బునను దిగ్గున ననంగఁ ౯ (గుధరచాప). 64

టీ. చెచ్చెర, (చెర+చెర=చెచ్చెర)సరగ, వేగిరము, వేగ, వేళము, వెసన్, వడిగన్, గ్రక్కునన్, గ్రద్దనన్, క్రన్నన, గొబ్బునను, దిగ్గునన్-ఈ ౧౨ ను శీఘ్రమునుగా ననుటకుఁ బేరులు.

క. కలవు వివరింపఁగా నా
ఖ్యలు వరుసన్ నిర్గమించె ౯ ననుటకు ధరలో
వెలువడియె వెళ్లె వెడలెను
వెలలె ననం (జిత్ప్రియాశ ౯ విశ్వాధిపతీ). 65

టీ. వెలువడియెను, వెళ్లెను, వెడలెను; వెలలెను-ఈ ౪ను పయనమయ్యెననుటకుఁ బేరులు.

క. వినుతి యొనరించె ననుటకుఁ
దనరున్ నామంబు లగుచు ౯ ధరపై నగ్గిం
చెను కైవారము సేసెన్
గొనియాడెను బొగడె ననఁగ ౯ గొండాడె ననన్. 66

టీ. అగ్గించెను, కైవారముసేసెను=స్తోత్రముచేసెను, కొనియాడెను, పొగడెను. కొండాడెను=ఈ ౫ ను స్తోత్రముచేసెననుటకు నామములు.

సీ. చుట్టలు విందులు ౯ చుట్టాలు బందుగు
లనఁ జను బంధు ౯ సమూహ్వాయములు

వఱలు నన్యుఁడు లాతి § వాఁ డనఁగా వింత
వాఁ డనఁగాఁ బెఱ § వాఁ డనంగ
వ్యాజంబునకు నామ § మౌ నెపం బనఁగ న
న్వేషించె ననుట కౌ § వెదకె నెమకె
నరసె రోసె ననంగ § నారసెఁ దడవె నాఁ
గాంక్షకుఁ బేరు లౌఁ § గ్రమముతోడఁ

తే. గ్రచ్చు కోరిక తమి కోర్కి § యిచ్చ యనఁగ
నెపుడు నెడపక యుడుగక § యెల్లపుడు దన
నిచ్చ యనయంబు నాఁగను § నిచ్చ లనఁగఁ
దనరు నాఖ్యలు సంతతం § బనుట (కీశ). 67

టీ. చుట్టలు, [ఏక. చుట్టము. బహు. మువర్ణలోపము] విందులు, చుట్టాలు,[మువర్ణలోప ఆదిదీర్ఘములు][బందుగులు][బంధుశబ్దభవము]-ఈ ౪ను బంధువునకుఁ బేరులు. లాతివాఁడు, వింతవాఁడు, పెఱవాఁడు-ఈ ౩ను అన్యుఁడనుటకుఁ బేరులు. నెపము-[ప్రకృతి-వికృతము.] వ్యాజమునకుఁ బేరు. వెదకెను, నెమకెను, అరసెను, రోసెను, ఆరసెను, తడవెను-ఈ౬ను విచారించెననుటకుఁ బేరులు. క్రచ్చు, కోరిక, [కోరుధా. కృదంత.] తమి, కోర్కి-ఇచ్చ [ఇచ్ఛాశబ్దభవము.] - ఈ 4 ను అపేక్షకుఁ బేరులు. ఎపుడు, ఎడపక, ఉడుగక, ఎల్లపుడు, నిచ్చ, అనయము, నిచ్చలు—ఈ ౭ ను సర్వదా యనుటకుఁ బర్యాయములు.

సీ. తనరుఁ బ్రవేశించె § ననుటకు నాఖ్యలు
తూఁకొనెఁ జొచ్చెను § దూఱె ననఁగ
సంక్షితాడితుఁ జేసె § ననుటకుఁ బేళ్ళగుఁ
దాఁచెఁ గాళ్ళ గ్రుమ్మెఁ § దన్నె ననఁగ

నాలస్య మొనరించె | ననుటకుఁ జెల్లు నా
మమ్ములు తడసెను | మసలె ననఁగ
ద్యక్త్రంబు గాలించె | ననుటకు నాఖ్య లౌ
పీడెను వదలెను | విడిచె ననఁగ

తే. దాఱుమాఱయ్యె పీడ్వడెఁ దడఁబడె నన
నాఖ్య లొవ్వు విపర్యస్త | మయ్యె ననుట
కలఁ బ్రహరించె ననుట కా | హ్వాయము లడిచెఁ
గొట్టె మొత్తెను మోఁదె నాఁ | (గుధరనిలయ) 68

టీ. తూకొనెను, చొచ్చెను, తూఱెను - ఈ ౩ ను ప్రవేశించెననుటకుఁ బేర్లు. తాఁచెను, కాళ్ళఁగ్రుమ్మెను, తన్నెను-ఈ ౩ ను కాలితోఁదన్నెననుటకుఁ బేరులు. తడసెను, మసలెను-ఈ ౨ ను ఆలస్యముచేసెననుటకుఁ బేరులు. పీడెను, వదలెను, విడిచెను-ఈ ౩ ను పరిత్యజించె ననుటకు నామములు. తాఱుమాఱయ్యెను, పీడ్వడెను, తడఁబడెను-ఈ ౩ ను హెచ్చుతక్కువయ్యెననుటకుఁ బేరులు. అడిచెను, కొట్టెను, మొత్తెను, మోఁదెను, ఈ ౪ ను ప్రహరించెననుటకుఁ బేరులు.

సీ. ముందట నెదుటను | మ్రోల ముంగల నాఁగ
నాఖ్య లౌ సముఖమం | దనుట (కళవ)
యలయిక బడలిక | యలపు సేద యనంగ
శ్రమమున కాఖ్య లౌఁ | (శమదమన)
తాలిమి యోరువు | తాలిక నాఁగను
క్షమకు నాహ్వాయము లౌఁ | (జర్మవసన)
ఠవళి బవంతంబు | టక్కు దుత్తూరంబు
వెద్దు నా ఛద్మ మౌ | (విమలనేత్ర)

తే. వెఱ పనఁగ నెద యనఁగను ʃ పెఱ యనంగ
నళు కనఁగ భీతి కాఖ్యలౌ ʃ (నసితకంఠ)
నిమ్మళం బన నెమ్మి నా ʃ నెమ్మది యనఁ
దనరుఁ బేళ్లు నిరాంతక ʃ మునకు [నీశ] 69

టీ. ముందటను, ఎదుటను, మ్రోలన్, ముంగలన్-ఈ ౪ ను సమ్ముఖమందనుటకుఁ బేరులు, అలయిక, బడలిక, (అలయు, బడలు-కృదంతములు.) అలపు,[అలయు-కృదం.] సేద-ఈ ౪ ను శ్రమమునకుఁ బేరులు, తాలిమి - రూ. తాల్మి. ఓరుపు-రూ. ఓర్పు, తాలిక - ఈ ౩ ను క్షమకుఁ బేరులు. రవళి[ఇది యన్యదేశము.]బవంతము, టక్కు, దుత్తూరము, వెద్దు- ఈ ౫ ను కపటమునకుఁ బేరులు. వెఱపు. ఎద, పెఱ, అళుకు- ఈ ౪ను భయమునకుఁ బేర్లు. నిమ్మళము, నెమ్మి, నెమ్మది(నెఱ+మది=నిండుమనస్సు) ఈ ౩ ను నిర్భయమునకుఁ బేరులు.

సీ. అసదు కొంచెము సైక ʃ మలఁతి యన్నువ చిన్న
నలికంబు సన్నంబు ʃ నా దనర్పు
స్వల్ప మొక్కడు నాఁగఁ ʃ జాల నెంతేనియు
మిగులఁ దద్దయుఁ దద్ద ʃ మిక్కిలి యనఁ
బెద్దయు ననునివి ʃ పేళ్ళగు భృశముగా
ననుటకు నుత్కట ʃ మయ్యె ననుట
కగుఁ బేళ్ళు వెగ్గలం ʃ బయ్యెఁ గ్రిక్కిఱిసె వె
క్కసమయ్యె ననునివి ʃ క్రమముతోడ
ఆ. నగ్గిఁ గుందె డొంకెఁ ʃ దగ్గను సడలెను
గ్రుంగె నుబ్బణంగె ʃ గ్రుక్కె ననఁగఁ
దనరుఁ బేళ్ళు క్షీణ ʃ దశ నొందె ననుటకు
(నీశ్వరీసనాథ ʃ విశ్వనాథ]. 70

టీ. అసదు, కొంచెము, సైకము, అలఁతి, అన్నువ, చిన్నఁ, నలికము, సన్నము-ఈ ౮ యు కొంచెమనుటకుఁ బేరులు. ఎక్కుడు, చాలఁ, ఎంతేనియుఁ, మిగులఁ, తద్దయుఁ, తద్ద, మిక్కిలి పెద్దయుఁ - ఈ ౮ యు అధికముగా ననుటకుఁ బేరులు, వెగ్గలమయ్యెను, క్రిక్కిఱిసెను, వెక్కసమయ్యెను, ఈ ౩ ను హెచ్చయ్యెననుటకుఁ బేరులు. సగ్గె, కుందె, డొంకె, తగ్గె, నదలె, క్రుంగెఁ ఉబ్బిణఁగె స్రుక్కె - ఈ ౮ యు క్షీణదశనొందె ననుటకుఁ బేరులు.

ఆ. మించు వాసి మేలు మేటి పెచ్చెచ్చన
నధికమునకు నాఖ్య లగుచు వెలయుఁ
బనులు నాఁగ జెయువు లనఁ జేఁత లన నొప్పు
గర్మమునకుఁ బేళ్ళు [చర్మవసన] 71

టీ. మించు, వాసి, మేలు, మేటి, పెచ్చు, ఎచ్చు-ఈ ౬ ను అధికమనుటకుఁ బేరులు. పనులు, చెయువులు, చేఁతలు (చేయుధా, కృధం.) ఈ ౩ ను కార్యమునకుఁ బేర్లు.

ఆ. అనిపె ననిచెఁ బనిపెఁ బనిచె నంపెను బంపెఁ
బుచ్చె గెలువుమనియెఁ బొమ్మటనియె
నఁనగ నివి సమాఖ్య లగును ప్రస్థాపించె
ననెడు క్రియకు [నీళ యభ్రకేశ].

టీ. అనిపెను, అనిచెను, పనిపెను, పనిచెను, అంపెను, బంపెను, పుచ్చెను, గెలుపుమనియె, పొమ్మటనియె-ఈ ౬ యు పయనముచేసి పంపెను అనుటకు నామములు.

తే. కొదవ కొద కుందు తగ్గు త క్కువ కొఱంత
వెలితి కొఱలొచ్చు కడమనా వెలయు న్యూన
సమభిధానము లర సామి సగయు సవము
నాఁగ నర్ధాహ్వయంబు లౌ [నాగభూష]. 73

టీ. కొదవ, కొద, కుంద్యు, తగ్గు, తక్కువ, కొఱత, వెలితి, కొఱఁ తొచ్చు, కడమ-ఈ ౧౦ యును న్యూనతకుఁ బేరులు, అర, సామ్ము, సగము, సవము-ఈ ४ ను అర్ధమనుటకుఁ బేరులు,

తే. పేళ్ళు పశ్చాత్తనుటకును ॥ వెల్లు వెనుక
బిదపఁ దర్వాతఁ బదపడి ॥ పిమ్మట నన
మునుపు మునుమున్ను తొలితొల్లి ॥ ముందు తొలుత
నన౯గ బూర్వశబ్దాఖ్య ॥ లౌ [గిరీశ]. 74

టీ. వెనుకఁ, పిదపఁ, తర్వాతఁ, పదపడి, పిమ్మటఁ-ఈ ౫ ను అనంతరం బనుటకుఁ బేరులు, మునుపు, మును, మున్ను, తొలి, తొల్లి, ముందు, తొలుత-ఈ ४ ను పూర్వమనుటకుఁ బేరులు.

ఆ. పాఱుబోతు పిఱికి ॥ పంద కోఁచ యనఁగ౯
బేళ్ళు దనరు సమర ॥ భీరువునకు
దిట్ట యుక్కుతునియ ॥ గట్టిడెందంబువాఁ
డనఁగ ధైర్యవంతుఁ ॥ డలరు [నీశ]. 75

టీ. పాఱుబోతు, పిఱికి, పంద, కోఁచ-ఈ ४ ను యుద్ధమున భయపడువానికిఁ బేరులు, దిట్ట. ఉక్కుతునియ. గట్టిడెందమువాఁడు-ఈ ३ ను ధైర్యవంతునకుఁ బేరులు.

తే. పౌఁజు చేరువ మొత్తంబు ॥ బారు తుటుము
దండు పరి గమి కూటువ ॥ పిండు దాఁటు
మూఁక దళమును బేళ్ళ ॥ సమూహమునకు
[భుజగవరహార యవిముక్త ॥ పురవిహార]. 76

టీ. పౌఁజు. చేరువ, మొత్తము. బారు, తుటుము. దండు.పరి.గమి. కూటువ. పిండు, [బృందము-ప్రకృతి.] దాఁటు, మూఁక.దళము-ఈ ౧౩ ను సమూహమునకుఁ బేరులు.

సీ. పూనె నూనెను దాల్చె నానెను మోచె నా
 వహియించె ననుట కౌ (నహివిభూష)
నామము లుచ్చాట నము చేసె ననుటకు
 వరుసతోఁ దఱిమెను బఱపె వెలిచెఁ
దోలెను ద్రొప్పె నా (ద్రుహిణాదిసురనుత)
 త్రిప్పెను నా క్రమ్మ ఱించె ననఁగ
మగిడించె ననఁగను మరలించె నన సమా
 హ్వాయములై పరఁగు ని వర్తితంబు
తే. చేసెననుటకు (సురముని సిద్ధసేవ్య)
 యడ్డగించెను నా నిల్పె ననఁగ నాఁగె
 నన నివారించె ననుటకు నాఖ్య లమరు
 (నగసుతానాథ గుహాగజా ననసనాథ). 77

టీ. పూనెను, ఊనెను, తాల్చెను, అనెను, మోచెను-ఈ ౫ ను ధరించె ననుటకు పేరులు. తఱిమెను, పఱపెను, వెలిచెను, తోలెను, త్రొప్పెను-ఈ ౫ ను ఉచ్చాటనము చేసెననుటకుఁ పేరులు. త్రిప్పెను, క్రమ్మఱించెను, మగిడించెను, మరలించెను-ఈ ౪ కు వెనుకకుఁ బొమ్మనె ననుటకుఁ బేరులు, అడ్డగించెను, నిల్పెను, ఆగెను-ఈ ౩ ను నిరోధించెననుటకుఁ బేరులు.

తే. దండ చేరువ సంగడి దాపు చెంత
 సరస చెంగట యొద్ద డ గ్గఱ కురంగ
 టండ పజ్జయు నా సమీ పాఖ్య లమరు
 (రమ్యధవళాంగ కలశేశ రథనిషంగ). 98

టీ. దండ, చేరువ, సంగడి, దాపు, చెంత, సరస, చెంగట, ఒద్ద, డగ్గఱ, కురంగట, అండ, పజ్జ [పశ్చాచ్ఛబ్దభవము,]-ఈ ౧౨ ను సమీపమందనుటకుఁ బేరులు.

తే. అచట నచ్చట నచ్చోట నందు నాడ
నచొట నచ్చోట నక్కడ నయ్యెడ నట
ననఁగ దత్ప్రదేశంబునం దనుట కాఖ్య
లయ్యె (భక్తవిధేయ యా ర్యాసహాయ). 79

టీ. అచట, అచ్చట, అచ్చోట, అందు, అడ, అచొట, అచ్చొట అక్కడఁ (అ+కడఁ) = ఆదిక్కున, అయ్యెడఁ (అ+ఎడఁ)=ఆ ప్రదేశమున, అటఁ ఈ ౧౦ యు ఆ ప్రదేశమం దనుటకుఁ బేరులు.

క. ఇరుగెలఁకుల నిరువంకల
నిరుదెస నిరుచక్కియందు నిరుపక్కియలం
దిరుగ్రేవల నిరుగడ నన
బొరిఁ బేళ్ళగు నుభయపార్శ్వముల ననుట (శజా)80

టీ. ఇరుగెలఁకులఁ. ఇరువంకలఁ, ఇరుదెసఁ, ఇరుచక్కియందుఁ, ఇరుపక్కియలందుఁ, ఇరుగ్రేవఁ, ఇరుగడఁ-ఈ ౭ ను రెండు వైపులందు ననుటకుఁబేరులు.

క. నవముగ ధరలో నీమా
నవవర్గవు వేడ్కఁ జదివి నను వ్రాసినమా
నవులకు ననవరతంబును
శివుఁ డవి ముక్తేశ్వరుండు చెలువం బొసఁగున్. 81

తా. ఎవరీ మానవవర్గ వ్రాయుచున్నారో, లేక చదువుచున్నారో వారికి, గాశీవిశ్వేశ్వరుని దయవలన సకల సంపదలు కలుగును.

మానవవర్గు సమాప్తము.

—0—

## స్థావరవర్గు

సీ. వలిదిప్ప వడఁకుగు । బ్బలి చలిమిరిమల
గట్టులఱేఁడు ము । క్కంటిమామ
మంచుఁగొండన హిమ । క్ష్మాధ రాఖ్యలు చను
వేలుపుఁగొండ జే । జేలగట్టు
పుత్తడిగుబ్బలి । పునుకకంచంవాని
విల్లు నా మేరువు । పేళ్ళు వెలయు
వెలిదిప్ప ముక్కంటి । మల వెండికొండ నాఁ
గైలాసపర్వతా । ఖ్యలు నెలంగు
తే. వెలయుఁ దరిగొండ కవ్వంపు । మలయనంగ
మంథ రాఖ్యలు కడపటి । మలయనంగఁ
జుట్టుఁగొండనఁ దనరు నీ । క్షోణియందుఁ
జక్రవాళాద్రి (వృషవాహ । శైల గేహ). 1

టీ. వలిదిప్ప(వలి=చల్లదనముగల, తిప్ప=కొండ), వడఁకుగుబ్బలి. సా. వడఁకుగుబ్బలి=వడఁకునట్లు చేయుపర్వతము, చలిమిరియల=చల్లని కొండ, గట్టులఱేఁడు=పర్వతములకురాజు, ముక్కంటిమామ = శివునకు మామ, మంచుఁకొండ=హిమము గలపర్వతము-ఈ౬ను హిమవత్పర్వతమునకుఁబేరులు, వేలుపుఁగొండ (వేలుపు+కొండ)=దేవతలు నివసించు పర్వతము, పుఱ్ఱకంచమువానివిల్లు=ఈశ్వరునిధనుస్సు-ఈ౪ను మేరుపర్వతము పేరులు, వెలిదిప్ప వెలిదిప్ప (వెలి+తిప్ప) = తెల్లని పర్వతము ముక్కంటిమల=శివుని కునికిపట్టగు పర్వతము, వెండికొండ=వెండివలెఁ దెల్లనిపర్వతము-ఈ ౩ ను కైలాసపర్వతము పేరులు. తరిగొండ (తరి

+కొండ),కవ్వపుమల (కవ్వము+మల)-ఈ ౨ను మందరపర్వతము పేరులు. కపటిమల=కడగానుండెడు పర్వతము, చుట్టుఁగొండ(చుట్టు+కొండ)=భూమిచుట్టునుండెడుపర్వతము-ఈ౨ను చక్రవాళపర్వతముపేర్లు.

ఆ. తూర్పు గొండ నాఁగ । దొలుగట్టు నాఁగను
బొడుపుగుబ్బ లనఁగ । బూర్వశిఖరి
పరఁగుఁ గ్రుంకుమెట్టు । పడమటికొండ నా
వెలయు న_స్తశిఖరి । (విశ్వనాథ). 2

టీ. తూర్పుగొండ (తూర్పు+కొండ)=పూర్వదిక్కునందుండెడు పర్వతము. తొలుగట్టు=పూర్వదిక్కునందలిపర్వతము,పొడుపుగుబ్బలి=సూర్యుఁడుదయించెడుపర్వతము-ఈ ౩ను ఉదయపర్వతమునకుబేరులు. క్రుంకుమెట్టు=సూర్యుడ_స్తమించుపర్వతము, పడమటికొండ = పడమటిదిక్కునందుండెడు పర్వతము-ఈ౨ను అ_స్తమయపర్వతము పేరులు.

తే. ఒప్పు గిరిపేళ్ళు మల గట్టు । తిప్ప మెట్టు
కొండ గుబ్బలి నా మేరు । (కుధరచాప)
ఱాయి నాఁ గల్లనంగను । ఱా యనంగ
శిల కభిఖ్యలు దగు నిల । (శేషభూష). 3

టీ. మల, గట్టు, తిప్ప, మెట్టు, కొండ, గుబ్బలి—ఈ౬ను పర్వతమునకుఁ బేరులు, ఱాయి, కల్లు ఱా-ఈ ౩ ను శిలకుఁ బేరులు.

తే. పల్లె కొట్టిక కొటిక కు । ప్పమ్ము నాఁగ
నూ రనఁగ గ్రామనామంబు । లొప్పుచుండుఁ
బట్టణంబున కాఖ్యలు । పరఁగుచుండుఁ
బ్రో లనఁగ వీ డనంగను । (శూలపాణి). 4

టీ. పల్లె, పల్లియ, కొట్టిక, కొటిక, కుప్పము, ఊరు- ఈ ౬ ను గ్రామము పేరులు, ప్రోలు, వీడు-ఈ ౨ ను పట్టణము పేర్లు.

ఆ. ఉనికిపట్టు తావు । మనికిప ట్టిర విల్లు
తెంకి యిక్క నట్టు । టెంకి యిమ్ము
నెలవు గీము నాఁగ । వలరు నివాసదే
శంబునకును బేళ్ళు । (చంద్రమౌళి). 5

టీ. ఉనికిపట్టు, తావు, మనికిపట్టు, ఇరవు, ఇల్లు, తెంకి, యిక్క, నట్టు, టెంకి, ఇమ్ము, నెలవు, గీము (గ్రహశబ్దభవము.)-ఈ ౧౨ను నివాస స్థానమునకుఁ బేరులు.

సీ. తెంకాయచెట్టనఁ । టెంకాయమ్రానన
నారికేళం బొప్పు । (నగనివేశ)
మావిమ్రాననఁగను । మామిడిచెట్టన
నామ్రభూజం బొప్పు । (నభ్రకేశ)
అత్తిమ్రానన మేడి । యనఁగ నౌదుంబర
ధారుణీజం బొప్పు । (మేరుచాప)
యరఁటి యనఁటి నాఁగ । నంశుమత్ఫలధారు
ణీరుహం బగు (ధర । ణీశతాంగ)
తే. యలరుఁ దుంబీశలాటున । మాఖ్య లాను
గంబు సొఱకాయ వదరు నా । [గరళకంఠ]
తా డనంగను దాడి నా । తాళభూరు
హంబునకు నాఖ్య లై యొప్పు । [నంబికేశ] 6

టీ. తెంకాయ, టెంకాయమాను- ఈ ౨ను కొబ్బరిచెట్టు పేరులు మావిమ్రాను, మామిడిచెట్టు - ఈ౨ను చూతవృక్షము పేరులు. అత్తిమ్రాను, మేడి- ఈ౨ను అత్తిచెట్టు పేరులు. అరఁటిఁ అనఁటి- ఈ ౨ను కదళీవృక్షమునకు నామంబులు. అనుగము, సొఱకాయ, వదరు- ఈ ౩ ను సొఱకాయపేరులు. తాడు, తాడి-ఈ ౨ ను తాటిచెట్టు పేరులు.

సీ. మొక్క మోక నిసువు మొలక మోసనఁగ నం
కురమునకును బేళ్ళు [కుధరచాప]
యిగు రనఁ దలిరు నాఁ జిగురు నాఁ జివు రనఁ
బల్లవనామముల్ పరఁగు [నీశ]
మ్రాననఁ జెట్టన మ్రాఁకన భూరుహ
నామధేయము లగు [వామదేవ]
పువు పువ్వు పూ నాఁగఁ బుష్పము విరి యల
రనఁ గుసుమాఖ్య లై యలరు [నీశ]

తే. గుబురు దట్టము జొంపంబు గుంపు తఱచు
నాఁగ నిబిడంబు పేళ్లొప్పు [నంది వాహ]
వల్లరిసమాఖ్య లగుచు వర్తిల్లుఁ దీఁగ
తీవ తీవియ తీవె నాఁ [త్రిపురవైరి] 7

టీ. మొక్క, మోక, నిసువు, మొలక, మోసు-ఈ ౫ను అంకురము పేరులు. ఇగురు, తలిరు, చిగురు- చివురు- ఈ ౪ను పల్లవము పేరులు. మ్రాను-రూ. మాను, చెట్టు, మ్రాఁకు- ఈ ౩ను చెట్టునకు నామములు. పువు, పువ్వు, పూ, పుష్పము (పుష్పశబ్దభవము.) విరి, అలరు — ఈ ౬ను పుష్పము పేరులు. గుబురు, దట్టము, జొంపము, గుంపు, తఱచు-ఈ ౫ను సందులేకయుండువానికిఁ బేరులు. తీఁగ తీవ, తీవియ, తీవె—రూ. తీఁగె— ఈ ౪ ను తీఁగకుఁ బేరులు.

ఆ. అగ్రమున కభిఖ్య లగుచుండుఁ దుద సుద
కొనయు నఁగ వృక్ష కోటరమున
కలరుఁ బేళ్ళు తొఱట తొల తొఱ్ఱ తొఱ నాఁగ
[నాగహార రజత నగవిహార] 8

టీ. తుద, సుద, కొన-ఈ ౩ ను అగ్రమునకుఁ బేరులు. తొలఁట, తొలి, తొట్టి, తొఱ—ఈ ౪ను చెట్టుతొఱ్ఱకు బేరులు.

ఆ. ఇక్షువున కభిఖ్య కిక్షుతిఁ గన్నుల
మ్రాను చెఱకు తియ్యమ్రాను ననఁగఁ
దనరు దవ యనంగఁ దలవాఁడె నాఁగఁ ద
దగ్రమున కభిఖ్య యగు (గిరీశ) 9

టీ. కన్నులమ్రాను=గనుపులుగల చెట్టు, చెఱకు, తియ్యమ్రాను=మధురమైనవృక్షము-ఈ ౩ను చెఱకునకుఁ బేరులు. తలఁవాడె-ఈ ౧ను చెఱకుకొనకుఁ బేరులు.

క. అగుఁ బేళ్ళుత్పలమునకుం
దొగ తొవ కల్వ కలువ యనఁగ దోయజ మొప్పుం
దగఁ దమ్మి తామ రనఁ గా
మొగ డన మొగ్గ యనఁదనరు ముకుళంబు(శివా) 10

టీ. తొగ, తొవ, కల్వ, కలువ-ఈ ౪ను ఉత్పలమునకుఁబేరులు. తమ్మి తామర-ఈ ౨ను తామరపువ్వునకుఁ బేరులు. మొగడ, మొగ్గ-ఈ ౨ను ముకుళమునకుఁ బేరులు.

తే. ఎనఁగు జెందొవ చెందొగ యెఱ్ఱకలువ
యనఁగ రక్తోత్పలంబు ర క్తాబ్జ మొప్పు
నిలను గెందమ్మి కెందామ యెఱ్ఱదామ
రనఁగ జెందమ్మి చెందామ రన (మహేశ) 11

టీ. చెందొవ, చెందొగ (చెన్ను+తొవ-గ)సువర్ణలోపము. చెందొవ (గ), ఎఱ్ఱగలువ (ఎఱ్ఱ+కలువ)-ఈ ౩ను ఎఱ్ఱనికలువకుఁబేరులు. కెందమ్మి (కెంపు+తమ్మి=కెందమ్మి), కెందామర (కెంపు+తామర=కెందామర), (బాల. సంధి. 36, 37 సూత్రములు చూడుఁడు) ఎఱ్ఱదామర (ఎఱ్ఱ+తా

మర), చెందమ్మి (చెన్ను+తమ్మి), చెందామర (చెన్ను+తామర)-ఈ ౫ను ఎఱ్ఱదామర పువ్వునకుఁ బేరులు.

క. గొడుగు గొడు వెల్లి యనఁ జె
న్నడరును ఛత్రంబు కేత నాహ్వయము లగుఁ
పిడె మనఁగ డెక్కె మనఁగా
బడగ యనన్ డా లనంగ (బర్వతధన్వీ) 12

టీ. గొడుగు, గొడువు, ఎల్లి-ఈ ౩ను ఛత్రమునకుఁ బేరులు. పిడెము, డెక్కెము, పడగ (పతాకాశబ్దభవము), డాలు-ఈ ౪ను ధ్వజమునకు బేరులు.

క. మఱుఁగనఁగ నోల మనఁగాఁ
మఱు వనఁగా జా టనంగ మా టన వరుసం
బరఁగు ని వెల్ల నగోచర
ధరణీనామంబు లగుచు (దర్పకదమనా) 13

టీ. మఱుఁగు, ఓలము, మఱువు, చాటు, మాటు-ఈ౫ను కన్నుల కగపడని ప్రదేశమునకు నామములు.

క. పొసఁగు దృణాఖ్యలు పులు నాఁ
గస వనఁగాఁ బూరి యనఁగ గడ్డి యనంగా
వసుమతిలో నెన్నంబడు
నసి నస్సెము పైరనంగ సస్యం [బభవా] 14

టీ. పులు, కసవు, (ఘాసశబ్దభవము) పూరి, గడ్డి-ఈ ౪ను తృణమునకుఁ బేళ్ళు. నసి, నస్సెము, (సస్యశబ్దభవము) పైరు-ఈ౩ను ధాన్యమునకు నామములు.

ఆ. తెలుపు దెల్ల వెల్ల తెటి వెలి నాఁగ నా
హ్వయము లమరు ధవళ వర్ణమునకుఁ

గప్పు నలుపు నల్ల ✽ కఱ యన నాఖ్యలౌ
నీలవర్ణమునకు ✽ (నీలకంఠ). 15

టీ. తెలుపు, తెల్ల వెల్ల, తెలి, వెలి - ఈ ౫ ను ధవళవర్ణమునకుఁ బేరులు. కప్పు, నలుపు, నల్ల, కఱ-పా. కటి-ఈ ౪ ను నీలవర్ణమునకుఁ బేరులు.

ఆ. కెంపు దొగరు దొవరు ✽ గెంజాయ యెఱు పెఱ్ఱ
యనఁగ నరుణకాంతి ✽ కాఖ్య లయ్యె
నళిది పసుపుచాయ ✽ యనఁగ హారిద్రవ
ర్ణమున కాఖ్య లగుఁ (బినాకహస్త). 16

టీ. కెంపు, తొగరు, తొవరు, కెంజాయ (కెంపు-చాయ), ఎఱుపు, ఎఱ్ఱ-ఈ ౬ ను ఎఱ్ఱనికాంతికిఁ బేరులు. ఆళిది-రూ. హళది, పసుపు చాయ-ఈ ౩ ను హారిద్రవర్ణమునకుఁ బేరులు.

ఆ. శ్యామవర్ణమునకు ✽ నామంబు లగుచుండుఁ
బసరుచాయ యనఁగ ✽ బచ్చ యనఁగ
వన్నె డాలు రంగు ✽ వన్నియ జిగి జోతి
చాయ యనఁగ బఱఁగు ✽ జగతి గాంతి. 17

టీ. పసరుచాయ, పచ్చ-ఈ ౨ ను ఆకుపచ్చవన్నెకు నామములు. వన్నె, [వర్ణశబ్దభవము.] డాలు, రంగు, వన్నియ, [ప్ర. వర్ణము.] జిగి, జోతి [ప్ర. జ్యోతిస్సు.] చాయ [ప్ర. ఛాయ]-ఈ ౭ ను కాంతికిఁ బేరులు.

తే. మానికము లన రతనముల్ ✽ నా నెసంగు
నవని మాణిక్యములకు స ✽ మాహ్వయములు
మెఱుఁగ సంగను నిగ్గు నా ✽ మెఱయుచుండు
నాఖ్యలుత్కృష్టకాంతికి ✽ (నభ్రకేశ). 18

టీ. మానికము [ప్రకృ. మాణిక్యము],రతనము[ప్రకృ.రత్నము]- ఈ ౨ను రత్నములకుఁ బేరులు. మెఱుఁగుఁ నిగ్గు-ఈ ౨ విశేషకాంతికిఁ బేరులు.

తే. జడధిపే ళ్ళగు మున్నీరు కడలి సంద్ర
మనఁగ మడుఁగన మడువు నా హ్రదముదనరుఁ
బరఁగు నాఱవసంద్రంబు పాల వెల్లి
జిడ్డుకడలి పాల్కడలి నా క్షీరజలధి. 19

టీ. మున్నీరు [మును+నీరు]=మొదటిసృష్టి. కడలి, సంద్రము, [ప్రకృ. సముద్రము] ఈ ౩ ను సముద్రమునకు నామములు. మడుఁగు, మడువు-ఈ ౨ ను హ్రదముపేర్లు. ఆఱవ సంద్రము, [లవణ, ఇక్షు, సుర, సర్పి, దధి, క్షీర, పీరసముద్రములోనిది యాఱవది]పాలవెల్లి[పాలు+వెలి] క్షీరప్రవాహము, జిడ్డుకడలి=జిడ్డుగల సముద్రము, పాలకడలి=క్షీరసముద్రము-ఈ ౪ ను క్షీరసముద్రమునకుఁ బేరులు.

క. సంజె యన మడి యనంగను
మంజుల కేదారభూసమాఖ్యలు వెలయుం
బుంజె యనఁ జేను బొల మనఁ
గం జన మరుభూమి పేళ్ళు (కాయజదమనా). 20

టీ. నంజె, మండి- ఈ ౨ ను మాగాణి భూమికిఁ బేరులు, పుంజె, చేను, బొలము-ఈ ౩ ను మెట్టభూమి పేర్లు కంజ-ఈ ౧ నిర్జలప్రదేశమునకుఁ బేరు.

క. ధరణిన్ వివరాఖ్య లగుఁ
బొఱియ కలుగు లాఁగ బొక్క బొందయనంగా
దరి దొడ్డు గట్టనంగాఁ
బరఁగుం దీరంబు పేళ్ళు (ప్రమథగణేశా). 21

టీ. బొటియ, కలుఁగు, రాఁగ, బొక్క, బొంద-ఈ ౫ ను బొంద పేర్లు. దరి, ఒడ్డు, గట్టు-ఈ ౩ ను తీరమునకుఁ బేరులు.

తే. అస లనంగను త్రొంపి నా నడు సనంగ
బుఱద నా నొప్పుఁ గర్దమంబునకుఁ బేళ్లు
భూమికి సమాఖ్య లగు బువి పుడమి నేల
మన్ను పంటవలంతి నా (మదనదమన), 22

టీ. అసలు, త్రొంపి, అడుసు, బుఱద—ఈ ౪ ను అడుసునకుఁ బేరులు. బువి (ప్రకృ. భువి.) పుడమి (ప్రకృ. పృథివి.), నేల, మన్ను, పంటవలంతి, పంటలనొసఁగుదేవి—ఈ ౫ ను భూమిపేర్లు.

తే. జగిలె యనఁగ నరుఁగు నాఁగ జగతి నాఁగఁ
దిన్నె యన వేదికాఖ్య లై యొన్నఁ దనరు
మిట్టి యనంగను మెరక నా మిట్ట యనఁగ
నున్న తక్షితికాఖ్యలై యొప్పు (నభవ). 23

టీ. జగిలె-రూ. జగ్గిలె, అరుఁగు, జగతి, తిన్నె,-ఈ ౪ ను తిన్నెకుఁ బేరులు. మిట్టి, మెరక, మిట్ట-ఈ ౩ ను ఎత్తయినచోటికిఁ బేరులు.

తే. తనరు నిశ్రేణి తాప నిచ్చెన యనంగఁ
దెప్ప తేప యనునాఖ్యల నొప్పుఁ బ్లవము
వరఁగు నోడ యనఁ గలమనఁ దరణిఁ దరణిఁ
(దరణిశీతాంశుశిఖనేత్ర ధవళగాత్ర). 24

టీ. తాప, నిచ్చెన-ఈ ౨ ను నిచ్చెనకుఁ బేరులు. తెప్ప, తేప-ఈ ౨ ను ప్లవమునకుఁ బేరులు. ఓడ, కలము ఈ ౨ ను నావకుఁబేరులు.

తే. శార్ఙ్గకం బొప్పు విల్లు సింగాణి యనఁగఁ
దూణ మొప్పు బత్తళిక నా దొన యనంగఁ

దరకనం బనఁ బొది యనఁ గ దనరు శరము
కోల ములి కమ్మ తూఁపు నాఁగ (శూలపాణి). 25

టీ. విల్లు, సింగాణి-ఈ ౨ ను ధనస్సునకుఁ బేరులు. వత్తళిక, దొన, తరకనము, పొది-ఈ ౪ ను అమ్ములపొదిపేర్లు. కోల, ములికి, అమ్ము, ఈ ౪ ను శరము పేర్లు.

తే. తనరుఁ జెల్లు తనుత్రాణకమునకుఁ గత్త
ళంబు జోడు జిరా దుప్పటంబు బొంద
ళం బనఁగ నాఖ్య లగు శతాంగకంబునకును
దేరు నా నరదము నాఁగ [మేరుచాప]. 26

టీ. కత్తళంబు, జోడు, జిరా, దుప్పటంబు, బొందళంబు-ఈ ౫ ను కవచమునకుఁ బేళ్లు. తేరు, అరదము(ప్రకృ....రథము.)-ఈ ౨ను రథము పేళ్లు.

క. కన్నా కనను దలక
ట్టన్నను మఱి మేలుబంతి యన్నను ధరలో
నిన్నియు శ్రేష్ఠము పేళ్లై
యొన్నంబడు రాజసభల [నిభధైత్యహరా]. 27

టీ. కన్నాకు, తలకట్టు మేలుబంతి-ఈ ౩ ను ఉత్తముని పేర్లు.

క. సొమ్మనఁ దొడ వనఁగా రవ
ణ మ్మన నగుఁ బేళ్ళు భూషణమ్ములకును హా
రమ్ములకు నగును నభిధా
నమ్ములు పేరు లన సరు లన నా [శితికంఠా]. 28

టీ. సొమ్ము, తొడవు, రవణము-ఈ ౩ ను భూషణమునకుఁ బేరులు. పేరు, సరి-ఈ ౨ ను హారమునకుఁ బేర్లు.

తే. సరములు నెత్తులు దండలు సరు లనంగ
నామధేయంబు లగుఁ బుష్పదామములకు
వాసనకు నాఖ్యలై యొప్పు వలపు కంపు
తావి కమ్మన యనఁగ (గాత్యాయనీశ) 29

టీ. సరములు, ఎత్తులు, దండలు సరులు- ఈ ౪ ను పూవులదండలకుఁ బేర్లు. వలపు, కంపు, తావి, కమ్మన- ఈ ౪ ను వాసనకుఁ బేరులు.

క. ఒడమె యన సొమ్మనంగా
విడిముడి యన రొక్క మనఁగ విత్తంబునకుం
బడమిని నామము లగు నివి
(యుడురాజకళావతంస యురగాభరణా). 30

టీ. ఒడమె, సొమ్ము, విడిముడి, రొక్కము (రుక్మశబ్దభవము)- ఈ ౪ ను ధనమునకుఁ బేర్లు.

తే. మచ్చు లన మిద్దె లనఁ గను మాడుగు లన
దారునిర్మితగేహముల్ దనరుచుండుఁ
బరఁగు సౌధంబు మేడ యుప్పరిగ యనఁగ
(నాగకేయూర మౌనిమానస విహార). 31

టీ. మచ్చులు, మిద్దెలు, మాడుగులు-రా, మాడువులు - ఈ ౩ను కొయ్యతోఁ గట్టబడిన యిండ్లకుఁ బేర్లు. ఉప్పరిగ, మేడ- ఈ ౨ను రాచనగళ్ళకుఁ బేర్లు.

తే. పెట్టి యన మంజూసం బగుఁ బెట్టె యనఁగఁ
బెట్టెయు యనంగఁ గోశనామాభిఖ్య లమరు
మ్రోడనంగను మోడు నా మొద్దనంగ
వెలయు స్థాణునామాఖ్యలు (విశ్వనాథ).

టీ. పెట్టి, మందసంబు, పెట్టె, పెట్టియ- ఈ ౪ను పేటిక పేర్లు. మ్రోడు,మోటు మొద్దు- ఈ ౩కు స్థాణువు పేర్లు.

ఆ. విస్తృతాఖ్య లొప్పు ౹ విప్పు తనర్పు నా
వెడఁద విరివి పఱపు ౹ వెడలు పనఁగ
దీర్ఘమునకు నామ ౹ ధేయంబు లై యొప్పు
నిడుద చాఁపు నిడివి ౹ నిడు పనంగ. 33

టీ. విప్పు, తనర్పు, వెడఁద, విరివి, పఱపు, వెడలుపు- ఈ ౬ను వెడల్పు పేర్లు. నిడుద, చాఁపు, నిడివి, నిడుపు- ఈ ౪ను నిడివికిఁబేర్లు

ఆ. ఈఁడు దినుసు సాటి ౹ యెన దొర సరి జోడు
సవతు మాఱ్ఱి యుద్ది ౹ జత తరంబు
పురుడు నాఁగ సదృశ ౹ మున కివి యాఖ్య లౌ
(వివిధగుణసనాథ ౹ విశ్వనాథ). 34

టీ. ఈడు, దినుసు, సాటి, ఎన, దొర, సరి, జోడు, సవతు,మాఱ్ఱి -రూ. మారిరి, ఉద్ది, జత, తరంబు, పురుడు-ఈ౧౩ను సమానమునకుబేర్లు

తే. పసిఁడి బంగరు బంగారు ౹ పైఁడి పొన్ను
జాళువా పుత్తడి యనంగ ౹ స్వర్ణ మమరుఁ
దప్త కాంచన మమరుఁ గుం ౹ దన మనంగ
డాని యపరంజి నా (గజ౹దానవారి) 35

టీ. పసిఁడి, బంగరు, బంగారు, పైఁడి. పొన్ను-రూ. హొన్ను' జాళువా; పుత్తడి-ఈ ౭ను బంగారమునకుఁ బేర్లు. కుందనము, కడాని' అపరంజి- ఈ ౩ను పుటము దీఱిన బంగారమునకుఁ బేర్లు.

ఆ. చిదుర తునుక తునియ ౹ చిదురుప వ్రక్క- పా
లనఁగ ఖండమునకు ౹ నాఖ్య లమరుఁ

ప్రోగు గుప్ప వామి ప్రోవు దిట్ట యనంగ
రాశి శాఖ్య లగు (ధరారాశతాంగ). 36

టీ. చిదుర, తునుక, తునియ, చిదురుప, ప్రక్క, పాలు-ఈ ౬ను ఖండమునకుఁ బేర్లు. ప్రోగు, కుప్ప, వామి, ప్రోవు, తిట్ట-ఈ ౫ను రాశికిం బేరులు.

క. ఈస్థావరవర్గం గడు
నాస్థ వినఁ జదువ వ్రాయ నవనీస్థలిలో
నాస్థాణునికృప నఖిలశు
భస్థితులును జనుల కొదవు భాసురలీలన్. 37

స్థావరవర్గు సమాప్తము

—)o(—

... తిర్యగ్వర్గు ...

సీ. పెడఁదమోముమెకంబు జడలమెకం బేనుఁ
గులగొంగ మెకములకోలముసామి
తెల్లడాలుమెకంబు తెఱనోటిమెకము సిం
గంబు నా బొబ్బమెకం బనంగఁ
బరఁగును మృగరాజు పసిదిండి పులి మెకం
బులతిండిపోతు చాఱల మెకంబు
మువ్వన్నె మెక మన నివ్వసుంధరయందు
వ్యాఘ్రంబునకు సమాఖ్యలు చెలంగుఁ
ఆ. బుట్టకూడుదిండి పో తన వెనుకమూ
పులమెకంబు నాఁగ నెలు వనంగ

నెలుఁగు నాఁగ మోరఁ తెలుపుమెకంబు నా
భల్లుకంబు దనరు ఁ (ఫాలనేత్ర). 1

టీ. వెడఁదమోముమెకము=విశాలముఖముగలమృగము,జడలమెకము=జటలుగలమృగము,ఏనుఁగులగొంగ=గజములకువిరోధి, మెకముల కొలముసామి=మృగములవంశమునకు రాజు, తెల్లడాలుమెకము=శ్వేతకాంతిగలది, తెలినోటిమెకము=తెలిచియుండెడునోరుకలది, సింగము, (సింహశబ్దభవము.) బొబ్బమెకము=బొబ్బలువేసెడుమృగము-ఈ ౮యు సింహమునకుఁ బేళ్ళు. పసిదిండి=(పసుల+తిండి) పశువును భక్షించునది, పులి, మెకంబులతిండిపోతు=మృగములను భక్షించునది, చారలమెకము=చారలుగలమృగము,మువ్వన్నెమెకము=మూఁడువన్నెలుగలమృగము-ఈ ౫ను వ్యాఘ్రమునకుఁ బేరులు. పుట్టకూడుదిండిపోతు=పుట్టకూడుతినునది వెనుకచూపులమెకము=వెనుకదృష్టిగలది, ఎలువు, ఎలుఁగు, మోరతెలుపు మెకము=ముఖమందు తెలుపుగలమృగము-ఈ ౪ను భల్లుకమునకుఁ బేళ్లు.

క. పలుగొమ్ములమెక మనఁగా
నిల నెక్కుడుమెక మనఁగ ఁ నేనుఁగనంగా
బలువంజమెకము నా జే
గలమెక మన గా రంగఁ ఁ గరి యొప్పు (శివా) 2

టీ. పలుగొమ్ములమెకము=దంతములే కొమ్ములుగాఁగలమృగము, ఎక్కుఁడుమెకము=ఎక్కుటకుయోగ్యమైనమృగము, ఏనుఁగు, బలువంజమెకము (బలువు+అంజ+మెకము), దూ. బలుహజ్జమెకము=బలువైన పాదములు గలమృగము, చేగలమెకము=హస్తము (తొండము) గల మృగము, గొరు-ఈ ౬ను గజమునకుఁ బేరులు.

తే. వాజికి సమాఖ్య లగుఁ దేజి ఁ వారువంబు
మావు గుఱ్ఱంబు తట్టువ ఁ వాపురంబు

కత్తలాని బాబా జిక్కి తత్తడి యన
(విగతభవపాశ కాశీనివేశ యీశా) 3

టీ. తేజి, వారువము, మావు, గుఱ్ఱము, తట్టువ, వావురము, కత్తలాని, బాబా, జిక్కి, తత్తడి-ఈ౧౦ను గుఱ్ఱమునకుఁ బేరులు.

క. తగ రేడిక పొట్టేలన
నగు మేషసమాఖ్య లెనిమి దడుగుల మెక మే
నుఁగుగొంగసూఁ డనంగా
జగతిన్ శరభాఖ్య లొప్పు (చంద్రార్ధధరా) 4

టీ. తగరు, ఏడిక, పొట్టేలు-ఈ ౩ను మేఁకకుఁ బేరులు. ఎనిమిదడుగుల మెకము=ఎనిమిది కాళ్ళుగల మృగము. ఏనుఁగుగొంగసూఁడు=సింహమునకు విరోధి-ఈ ౨ను శరభమృగమునకుఁ బేరులు.

క. సంగతి నుష్ట్రాఖ్యలు నొ
ప్పుం గడు నొంటె లన లొట్టిపిట్టలనన్ సా
రంగాఖ్య లలరు నిఱ్ఱుల
సంగా జింక లన లేళ్ళు నా (సర్వజ్ఞా) 5

టీ. ఒంటె. లొట్టిపిట్ట-ఈ ౨ను ఉష్ట్రమునకుఁ బేరులు. ఇఱ్ఱి, జింక లేడి-ఈ ౩ను జింకలకుఁ బేరులు.

క. సులిగొమ్ముల మెకమి ఱ్ఱన
నిల మృగమున కొప్పుఁ బేళ్ళు మృగి లేడి యనన్
వెలయును రెంటికిఁ దగు నా
ఖ్యలు జింక యనంగ నీశ (యంబరకేశా) 6

టీ. సులిగొమ్ముల మెకము=మెలికలు తిరిగియుండు కొమ్ములుగల మృగము, ఇఱ్ఱి-ఈ ౨ను మగజింక పేర్లు. లేడి—అను నీ ౧ యు ఆఁడు జింకకు పేరు. జింక-ఈ ౧యు ఆఁడు మగదుప్పులు రెంటికిఁ బేరు.

తే. పసులు తొడుకులు పసరముల్ § పసి యనంగఁ
బశువులకును సమాఖ్యలై § సరఁగు నాల
పోఁతు బసవఁడు గిబ్బ యాఁ § బో తనంగ
వృషభమున కాఖ్యలై యొప్పు § (వృషభవాహ) 7

టీ. పసులు, తొడుకులు, పసరము-రూ. పసలము, పసి-ఈ౩ను పశువులకుఁ బేరులు. ఆలపోతు=పశువులకుఁ బతి, బసవఁడు, గిబ్బ, ఆఁబోతు [ఆవు+పోతు]ఁ ఈ ౪ను వృషభమునకుఁ బేరులు.

సీ. తొట్టుపట్టు లనంగ § దొడ్డనఁగా నివి
గోష్ఠదేశమునకుఁ § గాఱలు (నీశ)
కదుపులు మొదవులు § పదువులు మందలు
నా ధేనుగణ మొప్పు § (నగనివేశ)
యలరు నాఖ్యలు లేఁగ § లన దూడ లనఁ గ్రేపు
లన వత్సములకును § (ధనదమిత్ర)
యావనఁగా గిడ్డి § యనఁ దొడు కన మొద
వన ధేనునామముల్ § దనరు (నభవ)
తే. యక్షమునకు సమాఖ్యలై § యొప్పుచుండు
గిత్త యెద్దనఁ గోడె నాఁ [కృత్తివాస]
యాలఁనగ ధేనువుల కాఖ్య § యలరుచుండు
శైలజానాథ ప్రమథసం § చయసనాథ 8

టీ. తొట్టుపట్టులు, దొడ్డు-ఈ౨ను కొట్టమునకుఁ బేర్లు. కదుపులు, మొదవులు, పదువులు, మందలు-ఈ౪ను అవులగుంపునకుఁబేరు. లేఁగ, దూడ, క్రేపు-ఈ౪ను దూడలకుఁబేర్లు. ఆవు, గిడ్డి. తొడుకుఁ మొదవు-ఈ ౪ను గోవులపేర్లు. గిత్త, ఎద్దు, కోడె-ఈ ౩ను ఎద్దునకుఁ బేర్లు. ఆలు [ఆవు+లు (వువర్ణలోపము)=ఆలు-బహువచనము]-ఈ౧యు ధేనువుల పేర్లు.

తే. అలరుఁ గుందేలు చెవులపోతనఁగ శశక
మొప్పుఁ బొడలమెకంబు నాఁ దుప్పి యనఁగఁ
గాఱుకొమ్ములమెక మనఁగను ధరిత్రి
రామనామమ్మృగంబు [ధరాశతాంగ]. 9

టీ. కుందేలు, చెవులపోతు-ఈ ౨ను కుందేటికిఁ బేర్లు. పొడలమెకము =మచ్చలుగలమృగము, దుప్పి, కాఱుకొమ్ములమెకము=సాంద్రశృంగములు గల మృగము-ఈ ౩ ను దుప్పికిఁ బేర్లు.

తే. దుంత యెనుపోతు జమునెక్కిరింత దున్న
యనఁగ మహిషంబునకు సమాఖ్యయము లమరుఁ
బరఁగు నెనుపెంట్లు గేదెలు బఱ్ఱెలెనుము
లనఁగ మహిషీసమాఖ్యలుఁ (ధనదమిత్ర). 10

టీ. దుంత, ఎనుబోతు, జమునెక్కిరింత=యమునివాహనము, దున్న-ఈ ౪ను మహిషంబునకుఁ బేర్లు. ఎనుపెంట్లు (ఎనము+పెంటి=ఎనుపెంటి), గేదె, బఱ్ఱె, ఎను-ము-ఈ ౪ ను మహిషీనామములు.

తే. పక్కి పులుఁగు పిట్ట యనంగఁ బక్షి యొప్పు
గఱుల తెక్కలు చట్టుపల్ ఱెఱక లనఁగఁ
బక్షముల కివి పేళ్ళగుఁ బర్హములకు
నాఖ్యలగు లావు లన నీఁకె లనఁగ (నీశ). 11

టీ. పక్కి, (ప్రకృతి. పక్షి.) పులుఁగు, పిట్ట-ఈ ౩ ను పక్షికిఁబేర్లు. గఱులు, తెక్కలు, చట్టుపలు ఎఱకులు-ఈ ౪ ను తెక్కలకు నామములు. లావు, ఈఁకె-ఈ ౨ను ఈఁకలకు నామములు.

సీ. తొలకరిఁ గిలుగు పుర్లులు నల్లజేజీలు
పాలు నీరును నేర్పఱుచు పులుఁగు

అంచలు తెలిపిట్ట లన నొప్పు హంసలు
క్రౌంచముల్ దనరారుఁ గొంచలనఁగ
గొక్కరాలనఁగను గొక్కులనంగను
గొక్కెరలనఁగను గొంగ లనఁగఁ
బరఁగు నభిఖ్యలు బకవిహంగములకు
నట్టువపులుఁగునా జుట్టుపులుఁగు

తే. నాఁగ నెమ్మన నెమలి నానమ్మి యనఁగఁ
కేకికి సమాఖ్యలగుఁ జంచరీకములకు
నాఖ్యలు జమిలిముక్కాలి యనఁగ దేఁటి
యనఁగఁ దుమ్మెద నా(సిశ యభ్రకేశ). 12

టీ. తొలకరికలుగుపుల్గులు=వర్షాకాలమునఁబాఱిపోవుపక్షులు, నల్వతేజీలు=బ్రహ్మకు వాహనములు. పాలు నీరును వేరుపఱచు పులుఁగులు=క్షీరోదకములను వేఱుపఱుచునట్టిపక్షులు, అంచలు (ప్రకృతి. హంసలు.) తెలిపిట్టలు=తెల్లనిపక్షులు, ఈ ౫ను హంసలకు నామములు. కొంచలు ఈ ౧ యు క్రౌంచపక్షులకుఁబేరు. కొక్కరా, కొక్కు, కొక్కెర, కొంగ-ఈ౪ను బకమునకుఁబేర్లు. నట్టువపులుఁగు=నాట్యముజేయుపక్షి, జుట్టుపులుఁగు=సిగగలపక్షి, నెమ్మి, నెమిలి, నమ్మి-౫ను కేకికి నామములు జమిలముక్కాలి=ఆఱుకాళ్ళు గలది, తేఁటి, తుమ్మెద-ఈ౩ను భ్రమరము పేరులు.

తే. పరఁగు నొడ్డీలు కూకీలు పల్లటీలు
పావురాలును బకదార్లు పావురములు
నాఁగఁ గలరవపక్షిబృందములపేళ్ళు
[పంకజాతాక్షసన్నుత ఫాలనేత్ర]. 13

టీ. ఒడ్డీలు,కూకీలు,పత్తిటీలు,పావురాలు,(పారావతశబ్దభవము,) బకదార్లు, పావురములు-ఈ ౬ ను పావురముకుఁ బేరులు.

తే. పుడమిలోపలఁ జదువులపులుఁగనంగఁ
జిగురువిల్కానితేజి నాఁ దొగరుముక్కు
పులుఁగనఁగఁ బచ్చఱెక్కలపులుఁగనంగఁ
జిలుక యన నొప్పుఁ గీరంబు (శ్రీమహేశ). 14

టీ. చదువులపులుఁగు=మాటాడుపక్షి, చిగురువిలుకానితేజి=మన్మథుని వాహనము, తొగరుముక్కుపులుఁగు=యెఱ్ఱనిముక్కుగలపక్షి, పచ్చఱెక్కలపులుఁగు=పచ్చనిఱెక్కలుగలపక్షి, చిలుక-ఈ ౫ ను చిలుకకుఁ బేళ్ళు.

తే. బట్టికాఁ డన గొరవంకపిట్ట యనఁగఁ
బరఁగు శారిక యేట్రింత పసులపోలి
గాఁడు కూఁకటిమూఁగ నాఁగను జెలంగు
విల భరద్వాజవిహగంబు (నీలకంఠ). 15

టీ. బట్టికాఁడు—పా. బట్టుకాఁడు, గొరవంకపిట్ట-ఈ ౨ ను గోరువంకకుఁ బేర్లు. ఏట్రింత, పసులపోలిగాఁడు, కూఁకటిమూఁగ-ఈ ౩ ను భరద్వాజపక్షికిఁ బేర్లు.

తే. జాలె డేగనఁ గురుజు నాఁ సాళ్వమనఁగఁ
గఱుజు నాఁగను జలకత్తె యనఁగ వేస
డం బనఁగ గిడ్డు నా నోరణం బనంగ
శ్యేనభేదంబు లగు [మహాసేనజనక]. 16

టీ. జాలె, డేగ, కురుజు, సాళ్వము, కఱుజు, జలకత్తె, వేసడము, గిడ్డు, ఓరణము-ఈ ౯ యును శ్యేనవిశేషములకుఁ బేళ్ళు.

తే. కోటఁ డనఁగను గూబనా ఘూకమమరుఁ
చిఱుతగూబ యనంగఁ బసిండికంటి
యనఁగ సకినాలపులుఁ గన నలరుచుండుఁ
బృథివిఁ గనకాక్షి యనుపక్షి [శ్రీమహేశ]. 17

టీ. కోటఁడు, గూబ-ఈ ౨ను గుడ్లగూబకుఁ బేరులు. చిఱుతగూబ= చిన్నగూబ, పసిఁడికంటి=బంగారమువంటి నేత్రములుగలది (సమాసాంతము), సకినాలపులుఁగు=శకునములపక్షి—ఈ ౩ను బంగరుకంటిపిట్టకుఁ బేర్లు.

తే. పాము సప్పంబు నిడుపఁడు పడగదారి
గాలిమేఁతరి విసదారి కానరాని
కాళ్ళయది చిల్వ పీనులకంటి పుట్ట
పెట్టెపట్టనఁ జను సహి పేళ్ళు [భర్గ]. 18

టీ. పాము, సప్పము, (ప్రకృతి, సర్పము.) నిడుపఁడు=దీర్ఘముగా నుండునది, పడగదారి=పడగనుధరించినది, గాలిమేఁతరి=వాయుభక్షణము సేయునది, విసదారి=విషమును ధరించినది, కానరానికాళ్ళయది=అగపడని పాదములు గలది, చిల్వ-రూ. చిలువ, పీనులకంటి=చెవులేకన్నులుగాఁగలదిఁ పుట్ట పెట్టె పట్టు=వల్మీకమును పెట్టెయును నివాసముగాఁగలది-ఈ ౧౦యు సర్పమునకు నామములు.

క. ఇల నెంచ రుధిరమున కా
ఖ్యలు నల్ల యనంగ నెత్తు రనఁగ ధరిత్రిం
బొల యీరు వెఱచి నంజుడు
పొల సన నివి పరఁగు మాంసమునకు [మహేశా]. 19

టీ. నల్ల, నెత్తురు-ఈ ౨ను రక్తమునకుఁ బేళ్ళు. పొల, ఈరువు, ఎఱచి, నంజుడు, పొలసు-ఈ ౫ను మాంసమునకుఁ బేళ్ళు.

క. భర్గుఁడు కాశీనిలయుఁడు
దుర్గాపతి యొసఁగు మదముకతో సీతిర్య
గ్వర్గు లిఖించినఁ జదివిన
దార్గత్యము లణఁచి సంపదలు నిత్యంబున్. 20

టీ. ఈ తిర్యగ్వర్గు వ్రాసినను, జదివినను, కాశీవిశ్వేశునిదయవలన దారిద్ర్యములు దొలఁగి సంపదలు గలుగును.

తిర్యగ్వర్గు సమాప్తము.

—0—

... నా నా ర్థ వ ర్గు ...

క. కలు పనఁ బే రగు దధికిం
గలు వన సస్యంబులోని కే గాదముపే రా
*వెలు గంద్రు కంపకోటను
వెలుఁ గందురు ప్రభను జనులు కే (విశ్వాధిపతీ). 1

టీ. 1. కలుపు=పెరుఁగు, పైరులోనికసవు. 2. వెలుగు=కంచె, వెలుఁగు=వెలుతురు.

క. మావు లనం దగు హయములు
మావు లనం బరఁగు నామ్రమహీజంబు లిలం
దావు లన స్థల మొప్పును
దావు లనన్ వాసనలకుఁ దగుఁ బేరుఁబేరు[శివా] 2

టీ. 1. మావులు=గుఱ్ఱములు, మామిడిచెట్లు. 2. తావులు=చోటులు,

*ఇది అరసున్నగలప్పుడు కాంతిని, లేనప్పుడు కంపకోటకును పేర గును.

వాసనలు. [పై రెండుపదములకును బహువచనమందే యీయర్థభేదంబుచెప్ప వీలుగునుగాని యేకవచనంబున నివి వేర్వేఱంతములుగలవిగావున నర్థద్వయము చెప్ప వీలుగాదు. ఏకవచనమున గుజ్జమునకు "మావు" మామిడి చెట్టునకు "మావి" యని రూపములు.]

క. ఇమ్మహిలో వలఁ జే రగుఁ
గొమ్మ యనఁ వృక్షశాఖకును భామినికిం
దమ్ములనం జే రగుఁ బ
దమ్ముల కనుజన్ములకును [దరుణేందుధరా.] 3

టీ.1.కొమ్మ=చెట్టుయొక్క కొమ్మ, ఆఁడుది. 2.తమ్ములు=తామరలు అనుజులు.[ఏకవచనమున నర్థద్వయమురాదు.తామరకు 'తమ్మి' అనుజునికి 'తమ్ముఁడు' అని రూపభేదము.]

క. ఇమ్ములఁ జే రగుఁ దాటం
కమ్ములకుఁ రేఖలకును కమ్మ లనఁ నా
మమ్మ దగుం గంఠాభర
ణమ్మునకును లతకుఁ దీఁగె నా [గౌరీశా]. 4

టీ. 1.కమ్మ=చెవికమ్మ,ఉత్తరము(జాబు) 2. తీఁగె=మెడనూలు, లత.

క. చెల్లును జేర్చి ధరలోఁ
దాళ్ళన సూత్రంబులకును దాళంబులకుం
గోళ్ళనఁ గుక్కుటములకును
జేళ్ళగు ఖట్వాంగములకుఁ జేళ్ళగు [నభవా.] 5

టీ. 1.తాళ్ళు=పగ్గములు, తాటిచెట్లు,[ఏకవచనములోరాదు.పగ్గము=తాడు,తాటిచెట్టు=తాడి] 2. కోళ్ళు=కుక్కుటములు, మంచపుఁగోళ్ళు. [ఈ యర్థము ఏకవచనములోరాదు,కుక్కుటము=కోడి, మంచపుఁగోడు=కోడు]

క. చామ యన సస్యమునకును
భామినికిని నాఖ్య యగుచుఁ ♦ బరఁగు ధరిత్రిన్
నామము లగుచును వెలయును
బాము లనన్ జన్మములకు ♦ భంగమ్ములకున్. 6

టీ. 1. చామ=ధాన్యవిశేషము, ఆఁడుది. 2. బాము=పుట్టుక, తిర స్కారము.

తే. దంట యనఁగ నభిఖ్యయై ♦ దనరుచుండు
జగతిలోపలఁ బ్రౌఢకు ♦ యుగళమునకుఁ
బఱ వనంగ నభిఖ్య యౌఁ బానువునకు
విస్తృతమునకు (శైలని ♦ వేశ యీశ). 7

టీ. 1. దంట=ప్రౌఢాంగన,జంట, 2. పఱపు=పానుపు,వ్యాపించుట.

క. తొలి యనఁగా నగు నామం
బులు పూర్వంబునకు సుషిర ♦ మునకును ధరలో
వెలి యనఁగ బహిర్భవశం
బులకును నామంబు (శేష ♦ భుజగవిభూషా). 8

టీ. 1. తొలి=మునుపు, బెజ్జము. 2. వెలి=బయలు, తెల్లన.

క. నెమ్మి యనన్ వంజులవృ
క్షమ్మునకున్ బ్రీతికిని సు ♦ ఖస్థితికిని నా
మమ్మగుఁ దగు (నతిధీర య
హమ్మతిజనదూర పన్న ♦ గాధిపహారా). 9

టీ. నెమ్మి=వంజులవృక్షము, నెమిలి, సౌఖ్యము గలిగియుండుట.

క. పాలం బేరగుచుండును
బా లనఁగా క్షీరమునకు ♦ భాగంబునకుం

గాలనఁ బేరగు నాలవ
పాలికిఁ బాదంబునకును (బాలేందుధరా). 10

టీ. 1. పాలు=క్షీరము,భాగము. 2.కాలు=పాదము,నాల్గవభాగము.

క. మేలన శుభంబు పేరగు
మేలన నుపరికిని గూరి మిశనం బేరా
మేలన మెచ్చునఁ బల్కిన
యాలాపంబునకు నాఖ్య యగు (జగదీశా). 11

టీ. మేలు=శుభము, పై భాగము, ప్రేమ, మంచిగాఁజెప్పినమాట.

క. భారుణిఁ బేరు వహించును
బూరుగు నా నూఁవాద్యమును శాల్మలియుం
బేరన నభిధానం బగు
హారమునకు నామమునకు (సంబరకేశా). 12

టీ. 1. బూరుగు=వాద్యవిశేషము, బూరుగుచెట్టు, 2. పేరు=ఒక
నామము, దండ.

క. కప్పన నీలిమపేరగుఁ
గప్పనఁగా నింటిమీఁదిఁకసవుకుఁ బేరౌఁ
గొప్పనఁ దగుఁ జాపాగ్రము
నా కొప్పగు ధమ్మిల్లమును గృహోపరిము (శివా). 13

టీ. 1. కప్పు=నలుపు, ఇంటిమీఁదవేయుపూరి. 2. కొప్పు=వింటి
కొన, స్త్రీలకొప్పు, ఇంటియొక్క నడికొప్పు.

క. ఒకభూరుహమునకును ధమ
నికిఁ బేరగు గ్రోవి యనఁగ నాటి నట్టుల వే
ణౌకభూజమునకు నధరము
నకుఁ బేరగు మోవి యనిన (నగరాట్చాపా). 14

టీ. 1. క్రోవి=గోరింటచెట్టు, గొట్టము, 2. మోవి=ఒకచెట్టు, పెదవి.

క. చవు లనఁగా నభిధానము
లవు మద్రుచులకును ము త్తి యపుపెత్తులకున్
భువిలోపల నామము లగు
గవు లన గుహలకును బూతి గంథంబులకున్. 15

టీ. 1. చవులు=ఆఱురుచులు, ముత్యాలసరము, 2. గవులు=గుహలు, దుర్వాసన, కంపు. (మొదటియర్థమున బహువచనము, దీనికి ఏక. గవి. రెండవయర్థమున నిదె ఏకవచనము.)

తే. ఆఖ్య చెల్లె నొప్పు ధరణిలో నపరదివస
మునకు ఛత్రంబునకు నెల్లి యనెడినుడువు
జక్కి యనుపేరు కరగుఁను సైంధవంబు
నకు ఘరట్టంబునకును (గం దర్పదమన). 16

టీ. 1, ఎల్లి=రేపు అనుట, గొడుగు, 2. జక్కి=గుఱ్ఱము, తిరుగలి.

తే. ఆడె ననుమాట నటియించె ననుటకును వ
చించె ననుటకు మఱియు నిం దించె ననుట
కాఖ్య యగుచును శోభిల్లు నాలు నాఁగ
గోవులకు భార్యకును బేరగు (స్మరహర). 17

టీ. 1. ఆడెను=నాట్యముచేసెను, పలికెను, నిందించెను. 2. ఆలు=(బహువచనము) గోవులు, (ఏకవచనము) భార్య. (దీనికి బహువచనము —ఆండ్రు).

సీ. రజతపునఃపునా ర్థములకు నభిధాన
మగు వెండి యన బంతి యనఁగఁ గందు
కమునకు శ్రేణికి నమరు నామ్నాయముగా
దండ యనం బుష్ప దామమునకు

సంతికంబునకుఁ బే రగు దొర యన నాఖ్య
యగు సదృశమునకు నవనిపతికి
వస్త్రసంఖ్యకు నహ మ్మనుటకు నాహ్వాయం
బగు నే ననఁగ సరి యనఁగ సదృశ

తే. మునకు సమసంఖ్యకును నామ ముగ నెసంగు
గొం తనఁగ నాహ్వాయం బగుఁ గుక్కుటాస
నంబునకుఁ గంతమునకును నల్ల యనిన
రక్తనీలాఖ్య మై యొప్పు (రాజమకుట).

టీ. 1. వెండి=రజతము, మరల. 2. బంతి=చెంతు, వరుస. 3. తంత=పూలదండ, సమీపము. 4. దొర=సమానము, రాజు. 5. ఏను=అయిదు, నేను. 6. సరి=సమానము, సమసంఖ్య. 7. గొంతు=కుక్కుటాసనము. మెడ. 8. నల్ల నెత్తురు, నలుపు.

సీ. తీరంబునకు దరి తీరధరంబునకు స
మాఖ్యమై యొప్పఁ గట్టనఁగ (నీశ)
కేతువునకుఁ గాంతి కిని సమాహ్వాయ మగు
డా లనంగను (మేరు శైలచాప)
శౌర్యధుర్యునకు లాం ఛనమునకును నామ
మగు బిరు దనఁగ (బ న్నగవిభూష)
గూబ నా నాఖ్య యౌ కంబునకుఁ గర్ణ
మూలంబునకు (నవి ముక్తనిలయ)

తే. యంతికంబునకును సమూ హంబునకును
నామ మై యొప్పుఁ జేరువ నాఁగ (నభవ)
సమభిధాన మై యొప్పుఁ బి శాచమునకు
బవనమునకును గాలి య న్పలుకు (రుద్ర). 19

జడలను (జటాజూటమును) ధరించినవాఁడు. గిబ్బసిపాయి=ఎద్దునెక్కెడి రౌతు, తిగకంటిదొర= త్రినేత్రుఁడగుప్రభువు, తుదిదిక్కుటెంకి =కడపటిదిక్కు (ఈశాన్యపుమూల) యునికిపట్టుగాఁగలవాఁడు-౪ ఈశానునిపేరులు. చిందము, కూఁతకైదువు=ఊఁదెడి యాయుధము,బూరగొమ్ము,నంకు (ప్ర. శంఖము.), వలమురి=కుడితట్టుగాఁ దిరుగునది -౨విష్ణువుయొక్క పాంచజన్యము. చుట్టువాలు, సుడివాలు, వట్రువవాలు- [ఈ ౩ పదములకు గుండ్రనియాయుధము అని యర్థము.) బటువువాలు= గట్టియాయుధము, పదినూఱులంచులవాలు=(పదినూఱులు=వేయి) వేయి యంచులగల యాయుధము. బిల్లవాలు=బిళ్ళవలె గుండ్రనైన యాయుధము- ౬ విష్ణువుయొక్క సుదర్శనము.

సీ. తుదచుక్క పేరిటి ƒ తొయ్యలి పెనిమిటి
కప్పుదేవరయన్న ƒ కలపదారి
కఱివల్వప్రోడ రోఁ ƒ కలితాల్పు తాటిజె
క్కెము మేటిబలియుఁడు ƒ జమునగొంగ
యన బలభద్రుపే ƒ ళ్ళగుఁ గ్రీడిచెలితేరు
పులుఁగురాయుఁడు చెలి ƒ మోముపక్కి
బొల్లి మోరపులుంగు ƒ నల్లనయ్యరవాలు
తోడలేనివానసై ƒ దోడు గరుడి
తే. వేలుపులబువ్వఁగొనుజోదు ƒ వెన్నుపడగ
చిలువమేఁతరి మేలిచ్చు ƒ పులుఁగు గరుటి
తల్లివేసట వాపిన ƒ దంట యనఁగ
వైనతేయసమాఖ్యలు ƒ వఱలు సాంబ. 15

టీ. తుదచుక్కపేరిటతొయ్యలిపెనిమిటి=(తుదచుక్కపేరు =నక్షత్రములలోఁగడపటినక్షత్రముయొక్క పేరుకాంతకుఁబెనిమిటి.) రేవతీరమణుఁడు, కప్పుదేవరయన్న=నల్లనిదేవరకు(కృష్ణునికి)అన్నయైనవాఁడు,

కలపదారి=నాఁగేలు ఆయుధముగాఁ గలవాఁడు, కఱివల్వప్రోడ = నల్లని పట్టుబట్టను ధరించిననేర్పరి-నీలాంబరుఁడు, రోఁకలితాల్పు=ముసలాయుధుఁడు, తాటిపెక్కెము మేటిబలియుఁడు=తాళధ్వజుఁడగు గొప్పబలవంతుఁడు. జమునగొంగ = యమునానదికి శత్రువు - బలరాముఁడు. క్రీడిచెలితేరు=అర్జునుని చెలికాఁడగు విష్ణువుయొక్క వాహనమైనవాఁడు,పులుఁగురాయఁడు = పక్షులకురాజు, తెలిమోముపక్కి = తెల్లనిముఖముగలపక్షి, బొల్లి మోరపులుంగు. (పై యర్థే.) నల్లనయ్యరవాలు = నల్లనిదేవుని యొక్క రవగాలు - అస్కందితగతినిఁబోవు గుఱ్ఱము - విష్ణువునకు వేగముగాఁ బోవ సాధనమైన వాహనము, తోడలేనిసైదోడు = అనూరుని కిఁదమ్ముఁడు, గరుడి(ప్ర.గరుడుఁడు), వేలుపులబువ్వఁగొనుజోదు=వేలుపులకాహారమయిన యమృతమునపహరించినబంటు, వెన్నుపడగ=విష్ణువు యొక్క ధ్వజమైనవాఁడు, చిలువమేఁతరి=పాములను దినువాఁడు, మేలిచ్చుపులుఁగు=జనులకు మేలుగలుగఁజేయుపక్షి, గరుటి (రూ. గరుడి.), తల్లివేసటవాపినదంట=తల్లియొక్క శ్రమములను బోఁగొట్టిన శూరుఁడు - ౧౩ గరుత్మంతుఁడు.

సీ. వడముడి తెమ్మెర | కొడుకన భీముఁడౌ
వేగంటికొమరుఁడు | వెన్ను నంటు
వెన్ను మచ్చదునీఁడు | విచ్చు కవ్వడి
గెలువు పేరుగలాఁడు | క్రీడి యనఁగ
నర్జుననామంబు | లగు ముత్తెరువులాఁడి
తెలివాఁక పొందాము | రలకుఁ బంట
కలికంతుతలమేలు | పెరుమాళ్ళడుగుబుగ్గ
జడదారిచెవియూట | చదలువాఁక



తే. తాటిపెక్కెముదణితల్లి | తాతపనఁటి

వెల్లి మినువాఁక మిన్నేఱు • వేల్పుటేఱు
తెల్లుకొనుపుసవతితల్లి • యనఁ దనరు
నమరతటినికి నామధే • యములు సాంబ.

టీ. వడముడి, తెమ్మరకొడుకు=పవననందనుఁడు - భీముఁడు వేగంటికొమరుఁడు=వేయికన్నులుగల దేవుని (ఇంద్రుని) పుత్రుఁడు, వెన్నునంటు=కృష్ణునికిఁ బ్రియస్నేహితుఁడు, వెన్నుమచ్చుదునీఁడు=వీఁపునందు మచ్చగల సరదారు. వివ్వచ్చు (ప్ర. బీభత్సుఁడు,) కవ్వడి=(కవ+వడి) రెండుచేతులతో నేక కాలమున బాణములనేయువాఁడు, గెలుపుపేరుగలాఁడు="విజయుఁడు" అనునామముగలవాఁడు. క్రీడి=[కిరీటి. ప్రకృతి] కిరీటము గలవాఁడు-౩ అర్జునుడు. ముత్త్రోవలాఁడి = మూఁడుమార్గములందుఁ బ్రవహించునది-త్రిపథగ. తెలివాఁక=తెల్లనినది, పొందామరలకుఁబంట=బంగారుతామరపువ్వుల కునికిపట్టయినది, నెకలికంటులయేఱు=ఈశ్వరుని శిరసునందు వసించునది, పెరుమాళ్ళడుగుబుగ్గ=విష్ణువుయొక్కపాదమందుఁ బుట్టిన నీటియూఁట-విష్ణుపది, జడదారిచెవియూట = బహ్నువనెడి మహర్షి యొక్క చెవినుండిపుట్టినది, చదలువాఁక=ఆకసమందుబాఱునది, తాటిటెక్కెముదంటితల్లి=తాళధ్వజుఁడగుభీష్మునితల్లి, తాతపసఁటివెల్లి=బ్రహ్మకమండలువునందలి నీటిప్రవాహము, మినువాఁక=ఆకసమందుఁబాఱెడునది, మిన్నేఱు [చూపైన,] వేల్పుటేఱు=[వేల్పు+ఏఱు] దేవతనది, తెల్లుకొనుపుసవతితల్లి=కుమారస్వామికి మారుతల్లి-౧౩ గంగానది.

సీ. వేల్పుసువారంపు • విడిది వెన్నునికెంకి
రతనాలపంట సం • ద్రంబు కడలి
పుడమిముద్దియకోక • మున్నీరు ప్రాయేఱు
మబ్బువువ్వులవెల్లి • మామమామ
గట్టురాకొమరుని • గాచిననేర్పరి
యేఱులమగఁడు రే • యింతిమామ

ముక్కంటియమ్ముల పొది మింటిలాయంబు
తోఁటదొడ్డియొసర్చు నీటుకాఁడు

తే. చందునయ లచ్చితండ్రి నా జలధి పరఁగు
వెల్లయేనుఁగు చౌదంతి వేల్పుగారు
మొదటివాత్తి నా సురకరి పొదలుఁ దెల్ల
జక్కి నిక్కువీనులమావు చదలుతేజ
యనఁగ నుచ్చైశ్శ్రవముపేరు లమరు సాంబ. 17

టీ. వేల్పుసువారంపువిడిది=దేవతల వంటయిల్లు, వెన్నునిసెంకి=విష్ణువుయొక్క వాసస్థానము, రతనాలపంట=రత్నములుఁ బండుచోటు, సంద్రంబు (ప్ర, సముద్రము,) కడలి, పుడమిముద్దియకోక=భూదేవికివస్త్రరూపమైనది. మున్నీరు=(మును+నీరు)పురాతనమైననీరు, ప్రాయేఱు=(ప్రాంత+ఏఱు.)ప్రాచీనమైనది, మబ్బుపువ్వులవెల్లి=(మబ్బుపువ్వులు=మేఘపుష్పములు-నీళ్ళు,)నీటికునికిపట్టు, మామమామ=మామయగు విష్ణువునకుమామ,గట్టురాకొమరునిఁగాచిననేర్పరి= (గట్టురాకొమరుఁడు=హిమవంతునికొమరుఁడు-మైనాకుఁడు) మైనాకుని రక్షించిన సమర్థుఁడు, ఏఱులమగఁడు = నదులకు భర్త, రేయింతిమామ=రాత్రియనుకాంతకు మామ (రాత్రి చంద్రునిభార్యయనువాడుక గనుకను,చంద్రుఁడుసముద్రునికిఁబుత్రుఁడగుటచేతనురాత్రికి మామయనబడియె),ముక్కంటియమ్ములపొది=త్రినేత్రునకుంద్రిపురసంహారసమయమునఁనమ్ములపొదియైనవాఁడు, మింటిలాయంబుతోఁటదొడ్డియొసర్చు నీటుకాఁడు=ఆకాశమును (స్వర్గమును) గుఱ్ఱపుశాలగాను, చెట్లతోఁటగను, పసులదొడ్డినిగాను చేసిననేర్పరి-స్వర్గమునఁగలయుచ్చైశ్శ్రవమనుగుఱ్ఱమును,కల్పవృక్షములను, గామధేనువును గన్నవాఁడు, చందునయ=చంద్రునితండ్రి, లచ్చితండ్రి=లక్ష్మీదేవికి జనకుఁడు-౧౩ సముద్రము. తెల్లయేనుఁగు=తెల్లనియేనుఁగు, చౌదంతి = నాలుగు

దంతములుగలది, వేల్పుగొౝరు=దేవతలయేనుగు, మొదటిహత్తి=మొదటి యేనుఁగు-2 ఐరావతము, తెల్లజిక్కి=తెల్లనిగుఱ్ఱము, నిక్కపీనులమావు=నిలుకొనియుండు చెవులుగలగుఱ్ఱము, చదలుతేజి=స్వర్గమందలి గుఱ్ఱము-3 ఉచ్చైశ్శ్రవము.

సీ. వేలుపుటెంకి కో § వెల దేవళము గుడి
యనఁగ దేవాలయా § ఖ్యలు చెలంగు
తెఱగంట్లు జన్నంపుఁ § దిండులు జేజేలు
తొలువేల్పుపగతురు § పలుకుటల్గు
మేటులు వేల్పులు § మింటిత్రోవరులు ని
ద్దురలేనిప్రోడలు § నరలుగనని
పెద్దలనఁగ సురా § భిఖ్య లౌ విన్ప్రోలు
వేగంటికచ్చేరి § వేల్పుటెంకి
తే. యనఁగ స్వర్గముపేళ్ళగు § వినుమిటూరు
లచ్చరలు వేల్పుచెలు లన § నమరు నమర
తరుణులకుఁ జాగరతనము § తలపుఁమా ని
క మనఁ జింతామణిసమాఖ్య § లమరు సాంబ. 18

టీ. వేలుపుటెంకి=దేవతలయునికిపట్టు, కోవెల, దేవళము(ప్ర.దేవాలయము,) గుడి-దేవాలయము. తెఱగంట్లు=తెఱచికొనియుండు కన్నులు గలవారు-అనిమేషులు, జన్నంపుదిండులు=యజ్ఞములయందు హవిర్భాగములను దినువారు, జేజేలు, తొలివేల్పుపగతురు=పూర్వదేవులకు (అసురులకు) విరోధులు, పలుకుటల్గుమేటులు=మాటలె యాయుధములుగఁ గలవారు. గీర్వాణులు, వేల్పులు=వేలుపులు, మింటిత్రోవరులు=ఆకాశమునఁ దిరుగువారు. నిద్దురలేనిప్రోడలు=నిద్రలేని నేర్పరులు. నరలుగనని పెద్దలు=ముదిమివలనవెండ్రుకలుమున్నగువానియందుఁగలుగు తెల్లదనములేని గొప్పవారు-, దేవతులు, విన్ప్రోలు=ఆకసమందుండు పట్టణము, వేగంటికచ్చేరి =

ఇంద్రునిసభ. వేల్పు టెంకి=దేవతలుండుచోటు-౩ స్వర్గము. అచ్చరలు [ప్ర. అప్సరసలు.]. వేల్పుచెలులు=దేవతాంగనలు-౨ అప్సరసలు చాగర తనము=ఇచ్చునట్టి రత్నము, తలఁపుమానికము = కోర్కులొసఁగు రత్నము-౨ చింతామణి.

సీ. అడిగిన నొసఁగెడి ఽ యావు జేజేగిడ్డి
చదలుతొడుకు తెల్ల ఽ మొదవనంగ
సురగవిపెళ్ళగుఁ ఽ దెఱగంటిమ్రాఁకులు
పెట్టుమ్రాఁకులు మింటి ఽ చెట్టు లనఁగఁ
గల్పశాఖ్యలగు వే ఽ గంటిగొంగలు రక్క-
సులు రేయిద్రిమ్మరుల్ ఽ సుకురుసిసులు
వేల్పుదాయలు తొలి ఽ వేల్పులు నా దైత్య
నామంబు లగు గాలి ఽ గాము నెగడి

తే. కొఱవి రాలువు బూచి పోఁ ఽ కుడు పిపాసి
దయ్య మనఁగఁ బిశాచాభి ఽ ధానము లగు
నివము వలి మం చనంగను ఽ హిమము దనరుఁ
బిడు గనఁగ శెల్లు నశనికిఁ ఽ జేళ్ళ సాంబ ' 19

టీ. అడిగిననొసఁగెడియావు=కోరినతోడుతనే యిచ్చునట్టియావు, జేజే గిడ్డి=దేవతలగోవు, చదలుతొడుకు=స్వర్గమందుండుగోవు, తెల్ల మొదవు=ధవళవర్ణమైనగోవు-౪ కామధేనువు. తెఱగంటిమ్రాఁకులు=దేవతలకు సంబంధించినచెట్లు, పెట్టుమ్రాఁకులు=కోరినది యిచ్చుచెట్లు, మింటి చెట్లు=స్వర్గమందలి వృక్షములు-౩ కల్పవృక్షములు. వేగంటిగొంగలు= ఇంద్రునికిఁ బగవారు, రక్కసులు=[ప్ర. రాక్షసులు] రేయిద్రిమ్మరుల్=

రాత్రులందుఁ దిరుగువారు, సుకురుసిసుఁ=శుక్రాచార్యశిష్యులు. వేల్పుదాయలు = దేవతలకు విరోధులు. తొలివేల్పులు=పూర్వదేవులు-౬రాక్షసులు. గాలి, గాము(ప్ర. గ్రహము), నెగడి, కొఱవిరాలుపు=కొఱవికట్టె త్రిప్పునది, బూచి, సోఁకుడు, పిపాసి (ప్ర. పిశాచము), దయ్యము (ప్ర దైవము)-౮ పిశాచము. ఇవము [ప్ర.హిమము], వలి, మంచు-౩ హిమము, పిడుగు-౧ వజ్రాయుధము.

సీ. మిన్ను చుక్కలత్రోవ విన్ను ప్పరము నింగి
వెన్నునియడుగు విఁ వేల్పుఁదెరువు
గాలితండ్రి బయలా కసము మొగులుతెన్ను
చదలుఁనా గగనాఖ్య లొందవుచుండు
బవలు పగలు నాఁగ దివము పేళ్ళగు రేయి
రాతిరి రే యన రాత్రి యమరు
దెస దిక్కు కడ యన దిశ యొప్పు నెల చంద
నఁగ మాస మమరుఁ బు న్నమ యనంగ

తే. నలరుఁ బూర్ణిమకు సమాన యమవస యనఁ
జను సమావాస్యపేరులు సంజ సందె
యనఁగదఁగు సంధ్య కాతవం బునకు నెండ
ప్రొద్దు వేండ్రం బనెడివేళ్ళు పొసఁగు సాంబ 20

టీ. మిన్ను, చుక్కలత్రోవ=నక్షత్రముల మార్గము, విన్ను, ఉప్పరము, నింగి,వెన్నునియడుగు=విష్ణుపది, విఁ-వేల్పుఁదెరువు=దేవతలుపోవునట్టిబాట, గాలితండ్రి=వాయువునకుఁ బుట్టుచోటు, బయలు, ఆకసము [ప్ర.ఆకాశము], మొగులుతెన్ను=మేఘములమార్గము. చదలు-౧౭ ఆకాశము. పగలు, పవలు-౨దినము రేయి, రాతిరి, రే-౩రాత్రి-దెస=[ప్ర. దిశ] దిక్కు [ఇది సంస్కృతసమము], కడ (ప్ర.కాష్ఠ)-౩ దిక్కు నెల,

చందు 2 ౨ మాసము. పున్నమ ౧ పూర్ణిమ, అమాస, అమవస-౨ అమావాస్య. సంజ, సందె - ౨ సంధ్యాకాలము. ఎండ, ప్రొద్దు, వేండ్రము - ౩ ఆతపము.

సీ. మెఱుపులు మెఱుఁగులు మించు లనఁ దటిత్తు
లగును జుక్కలు రిక్క లనఁగఁ దార
లమరు జేజేతేని యరదము నీటిమో
పరి మబ్బు మొయి లనఁ బరఁగు ఘనము
తెర యల తరఁగ నాఁ బొరయు వీచికపేళ్ళు
నుఱువు నుఱు గనంగఁ గొఱలు ఫేన
మంతస్సమాభిఖ్య లగును లోపల లోన
లో నన బహిరాఖ్య లొప్పును వెలి
తే. బయలు వెలుపల నాఁగ దీపంబు పేళ్ళు
వఱలుచుండును జోతి తిర్వాళిక దివ్వె
యనఁగ మందోష్ణమునకు వెచ్చన యొకింత
వేఁడి యిసుమంతకాఁక నా వెలయు సాంఖ్య. 21

టీ. మెఱుపులు, మెఱుఁగులు, మించులు - 3 విద్యుత్తు. చుక్కలు, రిక్కలు [ప్ర. ఋక్షములు]- ౨ నక్షత్రములు. జేజేతేని యరదము = ఇంద్రుని వాహనమయినది, నీటిమోపరి = నీటిని ధరించునది [జలధరము]— మబ్బు, మొయిలు-౪ మేఘములు. తెర, అల, తరఁగ [ప్ర. తరంగము.] -౩ సముద్రపుటలలు. నుఱువు, నుఱుగు - ౨ ఫేనము. లోపల, లోన, లో -౩ అంతర్భాగము. వెలి, బయలు, వెలుపల-౩ బహిర్భాగము. జోతి [ప్ర జ్యోతిస్సు], తిర్వాళిక (ఇది ద్రావిడపదము.] దివ్వె [ప్ర, దీపము]—౩ దీపము. వెచ్చన, ఒకింతవేఁడి, ఇసుమంతకాఁక-౩ కొంచెపాటియుష్ణము.

క. సిస్తుగ లక్షణకవి యగు
కస్తూరిరంగాఖ్యుఁడను గద్దితముగ నీ
నిస్తులదైవతవర్గము
విస్తర మొనరించినాఁడ విబుధులకరుణన్. 22

తా. చక్కఁగా లక్షణము లెఱింగిన కవియైన కస్తూరిరంగయ్యయను నేను లోకోపకారార్థము పండితుల యనుగ్రహముచే సాటిలేని దేవవర్గను విపులముగాఁ జెప్పితిని.

దేవవర్గు సంపూర్ణము

—o—

## మానవవర్గు

క. శ్రీనగజామానసలస
మానసరోహంస నిరుప మానవిభవధా
మా నవముగ నీ పేరిట
మానవవర్గువు రచింతు మానక సాంబా. 1

తా. కాంతియుక్తురాలగు పార్వతియొక్క మానసమనెడు ప్రకాశించెడికొలనికి రాయంచయైనవాఁడా! [పార్వతిచే నెల్లప్పుడు ధ్యానింపఁబడువాఁడా!] సాటిలేనికల్మికి నివాసమైనవాడా! ఓసాంబమూర్తీ! నీకంకితముగా నేను తప్పక నూతనముగా మానవవర్గును రచించెదను.

సీ. తొలిచదువులు ప్రాఁత పలుకులు మినుకులు
ప్రామినుకులు తొంటి బాస లనఁగ
వేదాఖ్య లగు నేల వేల్పులు తొలిజాతి
వారు మిన్కులచదు వరులు జన్మి

గట్టులు దుగపుట్టు - కలు పార్లు బాఁపలు
నాఁగ బ్రాహ్మణులకు - నామము లగు
జేలు దొరలు నేల - యేలుదంటలు వెన్ను
వలబుజమునఁ గల - వారు రాచ

తే. వారు జేఁడులు రెండవ - వంగడంపుఁ
బబువు లన క్షత్త్రియాఖ్య లౌ - బచ్చు జేరి
మూఁడవకొలం బతఁడు నాఁడె - కాఁడు నల్ల
నయ్యతోడబిడ్డ కోమటి - నాఁ దనర్చు
వైశ్యనామంబు లద్రిని - వాస సాంబ. 3

టీ. తొలిచదువులు, ప్రాఁతపలుకులు, మినుకులు, ప్రామినుకులు, తొంటిబాసలు (ఈయన్నింటికిని బూర్వవాక్యములు అని యర్థము.) = వేదములు. నేలవేల్పులు = పుడమికిదేవులు (భూసురులు), తొలిజాతివారు = అగ్రజన్ములు, మిన్కులచదువరులు = వేదాధ్యయనము చేయువారు, జన్నిగట్టులు = యజ్ఞోపవీతముఁ దాల్చినవారు, దుగపుట్టుకలు = ద్విజన్ములు, పార్లు (పాఱులు) = పాఱువారు, బాఁపలు = బ్రాహ్మణులు, జేలు, దొరలు, నేలయేలుదంటలు = పుడమినిఁ జాలించునేర్పరులు, వెన్నునివలబుజమునఁ గలవారు = విష్ణువుయొక్క కుడిబాహువునుండి పుట్టినవారు, రాచవారు = క్షత్త్రియులు, జేఁడులు, రెండవవంగడంపుఁబబువులు = రెండవకులమున (క్షత్రియవంశమున) బుట్టినరాజులు = క్షత్త్రియులు. పచ్చు, జేరి, మూఁడవకొలంబతఁడు = మూఁడవవంశమున (వైశ్యకులమున) బుట్టినవాఁడు, నాఁడెకాఁడు = నాణెముగలవాఁడు, చల్లనయ్యతోడబిడ్డ = విష్ణువుయొక్క తొడయందుఁబుట్టినవాఁడు, కోమటి = వైశ్యుఁడు.

సీ. కలవతొల్పులు తుది - కొలమునేర్పరులు కాఁ
పులు వినువాఁకతోఁ - బుట్టువు లన

నలరును శూద్రాఖ్య లమ్మ కన్నది తల్లి
యవ్వ నా మాతపే ర్లమరుఁ దండ్రి
యబ్బ కన్నయ్య నా యన యయ్య యప్పన
జనకాఖ్య లగుఁ దమ్ముఁ డనుఁగు తోఁడు
తోఁడఁబుట్టు వనంగఁ దోఁబుట్టు వన సోద
రాఖ్య లా మొదటివాఁ డన్న పెద్ద
తే. యనఁగ నగ్రజుఁ డగు నక్క యప్ప యనఁగ
జేష్ఠ్యకన్యకుఁ జెల్లెలు చెల్లె చెలియ
లనఁగఁ దనరు గనిష్ఠ కిల్లాలు రాణి
యాలు పెండ్లా మనఁగ భార్యకగును సాంబ 3

. కలపతాల్పులు = నాఁగేటినిధరించనవారు, తుదికాలము నేర్పరులు = కడపటి(నాలుగవ)కులమునందుఁబుట్టిననేర్పుగలవారు, కాఁపులు = క్షేత్రములనురక్షించువారు, విష్ణువాఁకతోఁబుట్టువులు = గంగానదికి సైదోడులు[శూద్రులు విష్ణుపాదమునఁబుట్టిరి యనిఁ శ్రుతి చెప్పుటచేతను, గంగ విష్ణుపాదోద్భవగనుకను గంగకు శూద్రులు దోఁబుట్టువులని చెప్పఁబడిరి.]-౪ శూద్రులు అమ్మ, కన్నది, తల్లి, అవ్వ-౪ జనని, తండ్రి, అబ్బ, కన్నయ్య (కన్న+అయ్య), నాయన, అయ్య = పూజ్యుఁడు, అప్ప-౬ జనకుఁడు. తమ్ముఁడు. అనుగు, తోడుతోడఁబుట్టువు. తోఁబుట్టువు-౫ సోదరుఁడు(చిన్నవాఁడు. మొదటివాఁడు = మొదటఁబుట్టినవాఁడు, అన్న, పెద్ద-3 పెద్దతోఁబుట్టువు (అగ్రజుఁడు) అప్ప. అక్క-౨ జేష్ఠభగిని. చెల్లె, చెలియలు,-౨ కనిష్ఠభగిని. ఇల్లాలు (ఇల్లు+ఆలు), రాణి, ఆలు, పెండ్లాము-౪ భార్య.

సీ. అయిదువరాలు ముత్తైదు వనఁ బురంధ్రి
కగుఁ దోడికోడ లేకరా లనంగఁ

బతిసోదరునిభార్య § వరఁగుఁ గూఁతురు కూఁతు
కొమరిత యనఁ బుత్రి § కమరుచుండుఁ
గొమరుండు బుడుకఁడు § కొడుకు పట్టియనంగఁ
బుత్త్రుఁ డౌ బిడ బిడ్డ § పూప పాప
కుఱ్ఱ చిఱుత కందు § కూన నిసువు పాల
బుడత నా శిశునామకములు దనర్చు

తే. గోల ముద్దియ ముద్దరాల్ § బేల ముగుద
యనఁగ ముగ్ధాంగనకు నాఖ్య § లగును ముదిమి
వాఁడు ముదుకఁడు ముదిసినవాఁడు ముసలి
ముదుసలి యనంగ వృద్ధుపే § ళ్ళొదవు సాంబ 4

టీ, అయిదువరాలు(ఐదువ+అలు-రేఫాగమము)-రూ. ఐదువరాలు, ముత్తైదువ-౨వృద్ధసుమంగలి- తోడికోడలు, ఏరాలు-౨ అన్నదమ్ముల భార్యలు కూఁతురు,కూఁతు,కొమరిత-౩ పుత్త్రిక, కొమరుఁడు,బుడుకడు, కొడుకు, పట్టి-౪ పుత్త్రుడు.బిడ, బిడ్డ,పూప, పాప,కుఱ్ఱ, చిఱుత, కందు, కూన, నిసువు-రూ, నిసుఁగు-పా. సిసువు, పాలబుడత=చంటిబిడ్డ- ౧౨ శిశువు, గోల, ముద్దియ,ముద్దరాలు(ముద్ద+ఆలు),బేల,ముగుద(ప్ర.ముగ్ధ) -౫ ముగ్ధ (ప్రాయమువచ్చినయాఁడుది.) ముదిమివాఁడు,ముదుకఁడు, ముదిసినవాఁడు, ముసలి, ముదుసలి-౫ వృద్ధుఁడు.

సీ. పిన్న కొండికవాఁడు § చిన్న పడుచు చోఱ
పసివాఁ డనెడిపేళ్ళు § బాలున కగు
జతురుపే ళ్ళగు దిట్ట § జాణ ధంట వలంతి
నెరవరి ప్రౌఢ నేర్పరి యనంగఁ
జెలికాఁడు సంగాతి § చెలిమరి గాదిలి
సకియ సంగడికాఁడు § సంగడీఁడు

చెలి నేస్తి యనఁ జను § స్నేహితునకు జెల్మి
నంటు మాలిమి పొందు § నంగ మైత్రి

తే. కొఱలుఁ గుఱుచ టింగణ గిడ్డ § గిఱక గుజ్జు
పొట్టి యన వామనాఖ్యలౌ § గట్టివాయి
ఱాఁగ జంత గయ్యాళియు § నాఁగఁ దనరు
ధూర్తవనితకు దురితవి § దూర సాంబ. 5

టీ. పిన్న,కొండికవాఁడు= చిన్నవాఁడు చిన్న, పడుచు, కొఱ-రూ, కౌఱ, పసివాఁడు-౭ బాలుఁడు. దిట్ట,జాణ,దంట,వలంతి,వెరపరి (వెరవు+అరి)=ఉపాయముగలవాఁడు (మత్వర్థీయకతద్ధితాంతము), ప్రోడ (ప్ర. ప్రౌఢుఁడు.) నేర్పరి(నేర్పు+అరి-మత్వర్థీయకతద్ధితాంతము), ప్రోడ (ప్ర. ప్రౌఢుఁడు,) నేర్పరి (నేర్పు+అరి+మత్వర్థీయకతద్ధితాంతము) = సామర్థ్యముగలవాఁడు-౩సమర్థుఁడు-చెలికాఁడు, సంగాతి= సంగాతము (స్నేహము)గలవాఁడు చెలిమరి=(చెలిమి+అరి.)చెలిమిగలవాఁడు, గాదిలి, సకియ (ప్ర. సఖి), సంగడికాఁడు-సంగడీఁడు-(పైరెంటికి సంగడికలవాఁడు అవియర్థము.) చెలి, నేస్తి=నేస్తముగలవాఁడు (నేస్తము+ఇ-మత్వర్థీయకతద్ధితాంతము.)-౬స్నేహితుఁడు,చెల్మి-రూ.చెలిమి, నంటు,మాలిమి-రూ.మాల్మి, పొందు-౪ స్నేహితము, కుఱుచ, టింగణ-రూ.టింగణా,గిడ్డ, గిఱక,గుజ్జు, పొట్టి-౭ కుఱుచవాఁడు.గట్టివాయి=పెద్దగొంతుగలది,ఱాఁగ,జంత,గయాళి-రూ. గయ్యాళి=అలక్ష్యము సేయునది-౫ ధూర్తురాలు.

సీ. కబ్బపునేఁతరి § కయి కైసరుఁడు మాట
లల్లువాఁ డనుపేళ్ళ § చెల్లుఁ గవికి
బట్టులు చదువరుల్ § బట్టు క్రిక్కిలనంగ
వందుల కగుఁ బడ § వాళ్ళు వేగు
వారు వేగరు లనఁ § జారులుపే ళ్ళొప్పు
బోయీలు బెస్తలు § మోవరు లన

వాహకులకుఁ జెల్లు ఽ సాహిణి సాని రా
తనఁగ నశ్వారోహ ఽ కునకుఁ దనరుఁ

తే. గట్టికలు పణిహారులు ఽ కటిక లనఁగ
వేత్రపాణుల కగు బోయ ఽ వేఁటకాఁడు
నడవిద్రిమ్మరి యనఁ గిరా ఽ తాఖ్య లెసఁగు
నన్నగఱ పేడి యన షండుఁ ఽ డగును సాంబ. 6

టీ. కబ్బపుసేఁతరి=గ్రంథములను రచించువాఁడు, కైసరుఁడు, మాటలల్లువాఁడు=పదము లొక్కటిగఁ జేర్చువాఁడు-౪ కవి. బట్టులు,చదువరులు (చదువు+అరులు)=చదువుగలవారు, బట్లు,క్రిక్కులు-౪ స్తుతి పాఠకులు, పడవాళ్లు, వేగువారు, వేగరులు-౩ చారులు-(మాఱువేసముతోఁ బరరాజ్యములనుండి యచ్చటి సంగతులనుఁ దమరాజునకుఁ దెలుపువారు.) బోయీలు, బెస్తలు,మోపరులు-౩ పల్లకులు మొదలగు వానిని మోయువారు. సాహిణి,సాని,రౌతు-౩ గుఱ్ఱపురౌతు. కట్టికలు, పణిహారులు, కటికలు-౩ బెత్తముదాల్చి కొలువుచేయు ద్వారపాలుర మున్నగువారలు. బోయ, వేఁటకాఁడు,అడవిద్రిమ్మరి-అడవులందు సంచరించువాఁడు-౩ కిరాతులు.అన్నగఱ పేడి-౨ నపుంసకుఁడు.

సీ. జాలరి వలజేఁడు ఽ మీలవేఁటరి యనఁ
దగు ధీవరునిపేళ్ళు ఽ తడుపుదాల్పు
వడు గొంటెజందెము ఽ వాఁడు బమ్మచారి
యన బ్రహ్మచారిపే ఽ ళ్ళమరు గేస్తు
మనికత్తెఁ డింటివాఁ ఽ డన గృహస్థునకగు
నడవికాఁపు తపసి ఽ జడలదారి
నాఁ జెలువొందు వా ఽ న ప్రస్థునకు నొంటి
కాఁడు గోణముదారి ఽ బోడ బీద

తే. కావులుగలాఁడు సన్నాసి, నా వెలుంగు
యతిసమాఖ్యలు ముగితిము, త్తయిదు వనఁగ
జక్కి నన్ బేరఁటాలన, జరగు మృతచి
రంటినామంబు లావన్న, రక్ష సాంబ. 7

టీ. జాలరి=(జాలము+అరి)జాలముగలవాఁడు,వలఖేఁడు=వలకుఁ బ్రభువు,మీలవేఁటరి=చేఁపలను వేఁటాడువాఁడు-౩ చెంబడివాఁడు. తతుపు దాలుపు=కొల్లాయివంటి పంచె కట్టుకొన్నవాఁడు, వడుగు (ప్ర. వటువు.), ఒంటి జందెముగాఁడు = ఒక్కజందెము వేసికొనువాఁడు. బమ్మచారి-౪ బ్రహ్మచర్యము పూనినవాఁడు, గేస్తు (ప్ర. గృహస్థు.), మనికిఖేఁడు= ఇంటియజమానుఁడు, ఇంటివాఁడు=ఇల్లుగలవాఁడు-౩ పెండ్లియైనవాఁడు. అడవికాఁపు=అడవియందు వసించువాఁడు,తపసి (ప్ర. తపస్వి.)=తపస్సు చేయువాఁడు, జడలదారి=జడలనుదాల్చినవాఁడు-౩ వానప్రస్థుఁడు. ఒంటి కాఁడు=ఏకాకి, గోఁణముదారి=గోఁచిపెట్టుకొన్నవాఁడు, బోడ,బీద, కావులు గలాఁడు=కాషాయవస్త్రముఁదాల్చినవాఁడు, సన్నాసి-౬సన్న్యాసి, ముగితి ముత్తయిదువ=ముక్తి నొందిన ముత్తయిదువ, జక్కిని, పేరంటాలు-౩ మృతినొందిన దీర్ఘసుమంగళి.

సీ. మూకాఖ్యలగు మూవ, మూఁగ మూఁగియనంగఁ
బ్రగుడ్డి చీకన నంధ, కునకుఁ జెల్లుఁ
బరువము ప్రాయము, వయసు జవ్వన మన
యౌవనాభిఖ్య లౌ, నందగాఁడు
వగకాఁడమరువాఁడు, వన్నెకాఁడెమ్మెకాఁ
డాసుకాఁడనఁ సొగ, సైనవాఁడు
నీటుకాఁడనఁగ రా, జిలుచు శృంగారికి
గోవాళ్ళు బొజుఁగు నాఁ, గోడెకాఁడు

తే. వెచ్చకాఁడు ననుపుకాఁడు వేడ్కకాఁడు
లంజెకాఁడు మిండఁ డనఁ బల్లవుఁడు దనరు
సోయగంబు చక్కఁదనంబు సొబగురూపు
నాఁగ సౌందర్యమునకు జెన్నగును సాంబ. 8

టీ. మూవ, మూఁగ, మూఁగి-౩ నోరులేనివాఁడు. (గ్రుడ్డి, చీకు-౨ కన్నులులేనివాఁడు,పరువము, ప్రాయము-రూ. పాయము, వయసు(ఇదిసంస్కృతసమమని తోఁచెడి). జవ్వనము(ప్ర. యౌవనము)-౫ ప్రాయము,అందగాఁడు=అందముగలవాడు, వగకాఁడు, అమరువాఁడు ఎమ్మెకాఁడు బొనుకాఁడు=హోషుకలవాఁడు, సొగసైనవాఁడు, సీటుకాఁడు-౭ సొగసు చేసికొన్నవాఁడు, గోవాళ్ళు, బొజుగు, కోడెకాఁడు, వెచ్చకాఁడు=అప్పిచ్చువాఁడు, ననుపుకాఁడు=ప్రేమగలవాడు, వేడ్కకాఁడు=తమాషాలుగలవాఁడు, లంజెకాఁడు, మిండఁడు-౮ విటపురుషుఁడు, సోయగము,చక్కఁదనము, సొబగు, రూపు-౪ సౌందర్యము.

సీ. గట్టిమనసువాఁడు గడుసరి యుక్కరి
దిటవరి దిట్టన ధీరున కగుఁ
గుచ్చితుఁ డడిగొట్టు కూళ పెంకె బికారి
ముడికాఁడు చిలుముబాల్ మోటు లుచ్చ
చెడిపోతు గరాసు మొండికట్టె తులువ
కైలాటకాఁడు టక్కరి పిసాళి
టకటొంకు టాటోటు తవళి దబ్బలి దూబ
గడుసు కల్లరి దోస కారి చెనఁటి
తే. పాలసుఁడు లండి పిక్కరి పలుప బెడుగు
బేరజ మనంగ ధూర్తుని పేరు లమరుఁ

వగఱు మార్తురు పగతురు పవతు లనఁగ
నహితులకు నామధేయము లమరు సాంబ.

టీ. గట్టిమనసువాఁడు, గడుసరి.(గడుసు+అరి),ఉక్కరి(ఉక్కు+అరి),దిటవరి(దిటవు+అరి), పైమూఁడుపదములకు "బలిమిగలవాఁడు" అని యర్థము, దిట్ట-౨౫ ధీరుఁడు, కుచ్చితుఁడు (ప్ర. కుత్సితుఁడు), అడిగొట్టు, కూళ, పెంకె, బికారి, ముడికాఁడు, చిలుమువాలు, మోటు, లుచ్ఛ, చెండిపోతు, గరాసు, మొండికట్టె, తులువ, కైలాటకాఁడు (కైలాటము+కాఁడు)=మాయోపాయము గలవాడు, టక్కరి = టక్కులు గలవాఁడు, పిసాళి. టకటొంకు, టాటోటు-రూ. తాటోటు, ఠవళి-రూ. తవళి, దబ్బళి. దూబ, గడుసు, కల్లరి=బొంకులాడువాఁడు, దోసకారి=పాపకార్యము లొనర్చువాఁడు. చెనఁటి. పాలసుఁడు. లంౙడి, పిక్కరి=పిక్కబలముగలవాఁడు. పలువ, చెడుగు, బేరజము-౩౩ ధూర్తుఁడు. వగఱు, మార్తురు, పగతురు, పవతురు-౪ శత్రువులు.

సీ. పెఱవారు కడవారు వింతవా రెడవారు
లోఁతివా రన నన్యు లకుఁ జెలంగుఁ
జుట్టలు చుట్టాలు చుట్టముల్ విందులు
బందుగు లనఁ జెల్లు బంధువులకుఁ
గూర్చువాఁ డెడకాఁడు కుంటెనకాఁ డనఁ
దాపికాఁ డనఁ బేరు దనరుచుండు
విటమాత బయకాఁడు వీణెకాఁ డనఁ బొల్చు
వైణికునకు గాణ పాటకుఁ డన
తే. గాయకున కగుఁ దిక్క వెంగలి వెడంగు
వెకలి వీఱిఁడి వెంబర విత్తు వెఱ్ఱి
వేఁదు అనఁగ నపస్మారి వెలయు జెవిటి
విననివాఁ డన బధిరాఖ్య లొనరు సాంబ.

టీ. వెలివారు,కడవారు, వింతవారు,ఎదవారు,లాతివారు- ౫ పొరుగువారు,చుట్టలు (చుట్టములు+లు-మువర్ణలోపము.), చుట్టాలు(చుట్టము+లు-మువర్ణలోపము, తత్పూర్వహ్రస్వమునకు దీర్ఘము), చుట్టములు, విందులు, బందుగులు(ప్ర.బంధువు.)-౫ బంధువులు,కూర్చువాఁడు=వీటినిదెచ్చి ఇచ్చువాఁడు,ఎడకాఁడు,కుంటెనకాఁడు, తాపికాఁడు—౪ విటునిదూత, బయకాఁడు, వీణెకాఁడు-౨ వీణెవాయించువాఁడు,గాణపాటకుఁడు-౨ గానముచేయువాఁడు తిక్క,వెంగలి,వెదంగు,వెకలి,వీటిఁడి,వెంబరవిత్తు,వెట్టి,వేఁదుఱు-౮ మఱుపుగలవాఁడు(అపస్మారి),చెవిటి,విననివాఁడు-౨ చెవులు వినఁబడనివాఁడు.

సీ. ఎకిమీఁడు పాదుసా § యేలిక మన్నీడు
    సాహెబు రాయఁడు § సామి పబువు
జియ్య తుపాసి వ § జీరుండు రాయలు
    దునెదారి రాజేఁడు § దొర యొడయఁడు
నేఁ డనవ_త్రిలు § నృపువేళ్ళు వడవాలు
    దళవాయి దళ్వాయి § దణి యనంగఁ
దగు దళక_ర్తకుఁ § దగువాఁడు వెరవరి
    తీర్పరి కార్చారి § దిట్ట యనఁగ
తే. గార్యక_ర్తకుఁ జెలఁగు బ్రెగ్గడ నియోగి
    ప్రెగడ మంతిరి నా మంత్రి § పేర్లు వెలయుఁ
బంగునకు లేవఁ జాలని § వాఁడు పుట్టు
    మొండి పిచ్చకుం టను పేళ్ళు § పొసఁగు సాంబ. 11

టీ. ఎకిమీఁడు,పాదుసా(ఇది హిందూస్థానిపదము)-రూ.పాదుసాహి, ఏలిక,మన్నీఁడు-పా. మన్నియ,రూ.మన్నియఁడు,మన్నెఁడు,మన్నె,సాహెబు(ఇది హిందూస్థానిపదము),రాయఁడు, సామి(ప్ర.స్వామి), పబువు (ప్ర

ప్రభువు),జియ్య,తుపాసి,వజీరుఁడు (ఇది హిందూస్థానిపదము.), రాయలు, దునెదారి-రూ.దునెదారి,రా,జేఁడు,దొర,ఒడయఁడు,నేఁడు-౨౭ రాజు, పడవాలు,దళవాయి,దళ్వాయి,దణి-౪ సేనానాయకుఁడు,తగువాఁడు,వెరవరి(వెరవు +అరి)=ఉపాయముగలవాఁడు,తీర్పరి(తీర్పు+అరి)=దిద్దుబాట్లుగలవాఁడు కార్భారి,దిట్ట-౫ కార్యములను జక్కఁగాఁజేయువాఁడు,ప్రెగ్గడ,నిజోగి (ప్ర. నియోగి)=ఉత్తరువు చేయువాఁడు,ప్రెగడ,మంతిరి-౪ మంత్రి, లేవఁజాలనివాఁడు,పుట్టుమొండి,పిచ్చుకుంటు-రూ. పిచ్చుకకుంటు-౭ పంగవు-ఈఁచఁబోయినకాళ్ళవాడు.

సీ. ఎడకాఁడు కొల్లగాఁడెడఁ ద్రోవకాపరి
గడిదొంగ దోఁపుడుకాఁడు నాఁచు
గజముచ్చు చేనాఁడికాఁడు జాజరకాఁడు
మచ్చరి మునిముచ్చు మాయదారి
తెరువాటుకాఁడు కత్తెరదొంగ దొరకోలు
సన్యాసి వడికాఁడు కన్నగాఁడు
కేద్రిమ్మరీఁడు ముల్లి యవిప్వా లోవాఁడి
కాఁడు తెక్కలికాఁడు కల్లరీఁడు
తే. తవళి మోసరి యనఁ జెల్లు దస్కరుఁడనఁ
దొత్తు సాఁకుడు బోనము కత్తె దాది
విలువరమ్ముఁడు విరవు డిల్‌బిడ్డ యనఁగ
దాసికానామధేయముల్ దనరు సాంబ. 12

టీ. ఎడకాఁడు, కొల్లగాఁడు=కొల్లచేయువాఁడు, ఎడత్రోవకాపరి=విర్జనమార్గమునందుఁ గాచియుండువాఁడు, గడిదొంగ=ఒళవెటింగినదొంగ దోఁపుడుకాఁడు - రూ. దోపిడికాఁడు = పరులసొమ్ము దోఁచువాఁడు, నాఁచు, గజముచ్చు=పెద్దదొంగఁ చేనాఁడికాఁడు=చేతిపదును గలవాఁడు.

జారకాఁడు-రూ. జజ్జరకాఁడు=వంచనసేయువాఁడు, మచ్చరి(ప్ర.మత్సరి)* కంటుగలవాఁడు, మునిముచ్చు=పళ్యతోహరుఁడు-చూచుచుండఁగ నేమార్చి కొట్టుకొనిపోవువాఁడు, మాయదారి=మోసముగలవాఁడు, తెరువాటుకాఁడు= దారినడ్డగించువాఁడు,కత్తెరదొంగ=కత్తెరతోఁ బనిచేయుదొంగ, దొరకోలు సన్యాసి=నమ్మించిమోసపుచ్చి దొంగలించుదొంగ,వడికాఁడు=చేతిచుఱుకుఁ దనముగలవాఁడు, కన్నగాఁడు=కన్నమువేయువాఁడు, రేద్రిమ్మరీఁడు= రాత్రులందు సంచరించువాఁడు, ముల్లియవిప్పు=ధనములముడులను విప్పు వాఁడు, లోవాఁడు=మనసునఁగఠినత్వముగలవాఁడు,తెక్కలికాఁడు=దొంగ తనము గలవాఁడు, కల్లరీఁడు (కల్ల+అరి+ఈఁడు స్వార్థమున నీ ప్రత్య యము,)=బొంకులాడువాఁడు, తవశి, మోసరి, (మోసము+అరి)=మోస ము గలవాఁడు-౨ఆ దొంగ. తొత్తు,సాఁకుడు, బోనముకత్తె=(వంటచేయు నది), దాది (ప్ర. ధాత్రి.), పిలువరమ్మఁడు=కూలికి బనిచేయునది), వర వుఁడు,ఇల్‌బిడ్డ-౨ఆ దాసి-పనికత్తె.

సీ. పడపుఁజాన గడించుకసడఁతి మేల్దావరి
భోగపుఁజేడియ కపొత్తుటాలు
వేడుకచెలి లంజెకవెలయాలు రోచెల్వ
వెల్లాటకత్తె నా క వేస్య వెలయు
గూర్చియిచ్చుమిటారి కసుందొనకత్తియ
తాపికత్తె యనంగఁ కదనరు దూతి
నాగవాసం బనకనామ మౌ వేశ్యల
మేళంబునకుఁ గొమకరాలు కొమి రె
తే. చామ జవరాలు కొమరితకజవ్వనియన
సుందరికిఁ జెల్లు గట్టిపె కసుదియుఁ ప్రోడ
యనఁగఁ దగుఁ బ్రౌఢ వయసుచెకల్లినది ముసలి
ముండకో రన లోలాఖ్యక ముఱియు సాంబ. 13

టీ. పడపుఁజాన (పడపు+చాన)=ధనసంపాదనచేయునట్టిస్త్రీ, గడిం చుపడఁతి=ధనమునుగూర్చుకాంత, మేల్దాపరి=వలపుఁజూపనిది-లాభముఁ దాఁచునది, భోగపుఁజేడియ (భోగము+చేడియ)=సుఖానుభవమునకైనట్టి మగువ, పొత్తుటాలు(పొత్తు+ఆలు)=అనురాగముఁజూపు పెండ్లము, వేడుక చెలి=సంతోషము గలిగించుసుందరి, లంజె, వెలయాలు (వెల+ఆలు)= విలువకువచ్చెడి పెండ్లాము, రొచ్చెల్వ=డబ్బునకువచ్చుభార్య, వెల్లాటకత్తి-రూ. వెల్లాటకత్తె=మిగులనాట్యము చేయునట్టిది-౧౧ వేశ్య. కూర్చియి చ్చుమిటారి=విటునిజేర్చునది, కుంటెనకత్తియ, తాపికత్తె-౩దూతిక. నాగ వాసము-౧ వేశ్యలసమూహము, కొమరాలు, కొమిరె=పిన్నవయసుది, చామ, జవరాలు=యౌవనముగలది, కొమరిత-రూ. కొమారిత, కొమార్త, జవ్వని (జవ్వనము+ఇ)=యౌవనముగలది-౮. ప్రాయముగలపడుచు. గట్టివైసుది ప్రోడ (ప్ర. ప్రౌఢ)-౨ ప్రౌఢాంగన-౩౦యేండ్లకు హెచ్చుతక్కువవయసు గలది. వయసుచెల్లినది. ముసలి, మిండకోర-రూ. మిండలకోర-౩ను ౫౦ ఏండ్లకుఁ బయిపడినను విటులను గోరునట్టి స్త్రీ-లోలస్త్రీ.

సీ. కన్నియ కన్నె నాఁ గన్యక కగుఁ బేరు
లాసగలది ఆంకుఁ గలాడి చెడిపె
వెలిచారవరి యనఁ బెలయు జారిణి పేళ్ళు
మెయి మేయి యొడలు నాఁ దమ్మేను మేను
బొంది మే మై యనఁ బొసఁగు దేహమునకు
నెఱికలు వెంద్రుకల్ నెఱు లనంగఁ
గేశసమాఖ్యలౌఁ గేశబంధము పేళ్ళు
కీల్కొప్పు క్రొమ్ముడి కీలుగంటు
తే. నూనెముడి వెన్నగంటు నాఁ నొసరు శిఖకు
జుట్టు సిక సిగ యనఁ జెల్లుఁ జొంచు కురులు

ముంగురులు కూఁకటు లనంగఁ బొసఁగుచుండు
కుంతలములకు జీతదైత్యకూట సాంబ. 14

టీ. కన్నియ, కన్నె-౨ కన్యక. ఆసగలది=ఇతరులపైయాశగలది, అంకులాడి, చెడిపె, వెలిచొరవరి=బయటిరుచిగన్నది-౪ జారిణిస్త్రీ. మెయి, మేయి, ఒడలు, నెమ్మేను, బొంది, మే, మై-౭ శరీరము. నెఱకలు, వెండ్రుకలు, నెఱులు-౩ కేశములు, కీల్ముడి, క్రొమ్ముడి (క్రొత్త+ముడి), కీలుగంటు, నూనెముడి, వెన్నుగంటు-౫ కేశబంధము-జాఱుగముడిచినవెండ్రుకల దూసుముడి, జుట్టు, సిగ, సికి-౩ శిఖ—జుట్టుముడి, చుంచుకురులు, ముంగురులు (మున్ను+కురులు)=ముందటి వెండ్రుకలు, కూఁకటులు-౩ చూర్ణకుంతలములు-పొడివెండ్రుకలు.

సీ. కొప్పు వేనలి మూలక్రొవ్వెద తుఱుము నాఁ
గబరి యాఁ జెలఁగెఁ గను కన్ను నంగ
నేత్రాఖ్యలగు నొసల్ నెన్నొసల్ నుదురు నె
న్నుదు రన నిటలాఖ్య లొదవుఁ జూడ్కి
పారువ దృష్టి చూపు వీక్షణము లొప్పు
వీనులు చెవులును జూనుగులును
నా నొప్పు శ్రోత్రముల్ కౌను లేఁగౌను న
న్నడుము నడు మనంగ నడరు మధ్య
తే. మునకుఁ బొక్కిలి బొడ్డనఁ దనరు నాభి
మూతి మోర మొకము మోము మొగ మనంగ
వదనము దనర్చు వా నోరు వాయి యనఁగ
ముఖమునాభిఖ్య లగు గురుమూర్తి సాంబ. 15

టీ. కొప్పు, వేనలి, మూల, క్రొవ్వెద (క్రొత్త+వెద), తుఱుము-౫ స్త్రీలకొప్పు. కన్, కను, కన్ను-౩ నేత్రము. నొసలు, నెన్నొసలు, నుదురు, నెన్నుదురు-౪ ఫాలము. చూడ్కి. రూ. చూడికి, పారువ (ద్రావిడము.),

దిష్టి (తెలుఁగున ష కారము లేదు గనుక ఈరూప మసాధువు.), చూపు-౫ వీక్షించుట-దర్శించుట. వీనులు, చెవులు, జానుగులు-౩ శ్రోత్రములు. గౌను, లేఁగౌను (లేత+కౌను), నెన్నడుము (నెఱ+నడుము), నడుము-౪ మధ్యము. పొక్కిలి, బొడ్డు-౨నాభి. మూతి, మోర, మొకము, మోము, మొగము (ఈ ౩ ను ముఖశబ్దభవములు)-౫ వదనము. వా, నోరు, వాయి-౩ వదనగుహ (నోరు).

సీ. పలు పల్లు పండులు పండ్లన రదము లౌఁ
 జెంప దవుడ చెక్కు చెక్కి లనఁగఁ
దగుఁ గపోలము నెత్తి తల యన శిర మొప్పు
 ముకు ముక్కు నంగ నాసిక చెలంగు
బొమ కనుబొమ యన భ్రూనామ మమరు మీ
 సలు మీసము లనంగ శ్మశ్రువలరు
నధరము కెమ్మోవి పెదవి వాతెఱ మోవి
 యన నోష్ఠ మగు నెద యుక్కు ఱొమ్ము
తే. నెడఁద యన వక్ష మగుఁ బొట్ట కడుపు బొజ్జ
 బొఱ్ఱ డొక్కన నుదరంబు పొసఁగుచుండుఁ
గేలు కై కయి చేయి కెంగే లనంగఁ
 బంచశాఖకు నామముల్ పరఁగు సాంబ. 16

టీ. పలు, పల్లు, పండులు, పండ్లు-౪ దంతములు. చెంప. రూ. చెంక, దవుడ. రూ. దౌడ, చెక్కు, చెక్కిలి-౪ కపోలము. నెత్తి, తల-౨ శిరస్సు. ముకు, ముక్కు-౨ ఘ్రాణము. బొమ, కనుబొమ-౨ భ్రూరేఖ, మీసలు (మీసము+లు-మువర్ణలోపము.), మీసములు. రూ. మీసాలు-౩ శ్మశ్రువులు. అదరము (ప్ర. అధరము,), కెమ్మోవి (కెంపు+మోవి), పెదవి

వాతెఱ=(వాయి+తెఱ) నోటిరంధ్రమును మూయునది, మోవి-౫ ఓష్ఠము. ఎద, అక్కు, ఱొమ్ము, ఎడఁద-౪ హృదయము, పొట్ట, కడుపు, డొల్ల, బొజ్జ, డొక్క-౫ ఉదరము. కెలు (నిత్యైకవచనాంతము.) కై, కయి, చేయి, రూ, చెయ్యి, చెయి, చే, కెంగేలు(కెంపు+కేలు)-౭ కరము.

సీ. అఱచెయ్యి లోచెయి యనఁ గరతల మొప్పుఁ
పెడచెయ్యి మీఁజెయిఁ వెనుకచెయ్యి
యనఁదగుఁ జరమశయంబు వేల్ వ్రేలన
నంగుళి యగుఁ జరమాంగమునకు
వెన్ను వెనుకమేను వీఁపన వర్తిల్లు
గద్దువ గడ్డము గౌద యనఁగఁ
జిలుకనామంబు తోలుజిల్లుఁ గడవసంబు
చట్టతో లనఁ గళాసంబు నాఁగఁ
తే. జర్మమమరు మోఁకాళ్ళన జానువు లగుఁ
బిక్క-చిఱుదొడ యన జంఘ పేళ్ళుదనరుఁ
గురు పుతొడ యన నూరువు వఱలు ముడ్డి
పిఱుఁదు తుం టన జఘనంబుపేళ్ళు సాంబ. 17

టీ. అఱచెయ్యి, లోచెయి-౨ చేతిలోభాగము, పెడచెయ్యి, మీజెయి (మీదు+చెయి), వెనుకచెయ్యి=చేతి వెనుకటి భాగము-౩ చేతి వెనుకటి భాగము. వేలు, వ్రేలు-౨ అంగుళి. వెన్ను, వెనుకమేను, వీఁపు-౩ చేతి వెనుకటి భాగము. వేలు, వ్రేలు-౨ అంగుళి. వెన్ను, వెనుకమేను, వీఁపు-౩ పృష్ఠము, గద్దువ, గౌద, రూ. గవుద-౩ గడ్డము. కడవసంబు, చట్ట, తోలు, కళాసము-౪ చర్మము. మోకాళ్లు-౧ జానువు. పిక్క, చిఱుదొడ=చిన్నతొడ-౨ పిక్క, కుఱువు, తొడ-౨ ఊరువు, ముడ్డి, రూ. మూడి, పిఱుదు, తుండి=౩ కటిభాగము.

సీ. పునుక పుఱియ పుచ్చె — యనఁ గపాలం బొప్పు
బుజము మూఁ పన జెల్లు — భుజముపేళ్లు
బట్ట వలువ కోక — పుట్టంబు గింతెంబు
చీర నా వసనంబు — చెలఁగు నఱుత
గొంతు కుత్తుక యట్టు — కొలిమి మెడ యనంగ
గళమున కగుఁ బిడికిలి యన ముష్టి
కగుఁ బ్రసృతికిఁ జేర — యన నంజలికి దోయి
లన హస్తమునకు మూర — యనఁగ బొసఁగు

తే. బార యనఁగను వ్యామాఖ్య — బరఁగు జేన
దుత్త యనఁ దాలమున కొప్పు — బెత్త యనఁగ
నంగులాభిఖ్య యగు నంఘ్రి—హజ్జ యడుగు
నాఁగ బాదాఖ్య లగు లోకనాథ సాంబ. 13

టీ. పునుక. రూ. పున్క—, పుఱియ. రూ. పుఱె, పుచ్చె— ౩ కపాలము, బుజము, మూఁపు—౨బాహువు. బట్ట, వలువ, కోక, పుట్టము, గింతెము చీరె—౬వస్త్రము, అఱుత, గొంతు, కుత్తుక, అట్టు, కొలిమి, మెడ—౬ కంఠము. పిడికిలి-ముష్టి, చేర—౧ప్రసృతి(చాఁచినవ్రేళ్ళుగలయఱచెయి). దోయిలి, రూ. దోసిలి—౨అంజలి. మూర—౧హస్తము (మోచెయ్యిమొదలువ్రేళ్ళకొనవఱకుండుకొలఁగము.) బార—౧వ్యామము(రెండుచేతులుచాఁచినడుమనుండు సందు), జేన, దుత్త—౨తాలము చాచినబొటనవ్రేలికొనకు చిటికెనవ్రేలికిని నడుమనుండు సందు). బెత్త—౧ అంగుళము, అంఘ్రి, హజ్జ, రూ. అడుగు— అజ్జ ౩పాదము.

సీ. చగులు గుబ్బలు చండ్లు—చాచులు పాలిండ్లు
చన్ను లనంగఁ గుచంబు లమరు

నారు నూఁగా రన  నలరు రోమావళి
పాపలఁగనుతావు  పత్తబుయ్య
మరినిల్లు దుబ్బన  మదనమందిర మొప్పుఁ
బిల్లలఁ గలిగించు  పేరు చుల్లి
బుల్ల బెల్ల మనంగఁ  బొసఁగు శేఫము గాఁడు
గుద్ద పిఱ్ఱ యనంగ  గుదము దనరుఁ
తే. పైఁట పయ్యెఁట బయ్యెద  పయఁట చెఱఁగు
నాఁగఁ జేలాంచలాభిధా  నంబు దెలఁగుఁ
గలువడము చందువా మేలు  కట్టనంగ
నతిశయిల్లు వితానాహ్వ  యములు సొంబ. 19

టీ. చనులు,గుబ్బలు,చండ్లు, చాచలు, పాలిండ్లు, చన్నులు-౬ స్తనములు. ఆరు, నూఁగారు-౨నాభిక్రిందిరోమరేఖ.పాపలఁగనుతావు=బిడ్డలను గనునట్టితావు,పత్త,బుయ్య,మరునిల్లు,దుబ్బ-౫మన్మథాగారము(స్త్రీలింగము) పిల్లలఁ గలిగించుపేరు=బిడ్డలఁబుట్టించుటకు మూలమైనది,చుల్లి,రూ. చుల్ల. బుల్ల, బెల్లము-౪ పులింగము. గాఁడు,గుద్ద,పిఱ్ఱ-౩ అపానస్థానము. పైఁట, పయ్యఁట,పయ్యెద, రూ. పయ్యద, పయఁట, చెఱఁగు-౬చీరకొంగు. కలువడము,చందువా,మేలుకట్టు-౩వితానము (వివాహాదులందుఁ బందిటికిఁజేయు వస్త్రాలంకారము).

సీ. చెలి ముద్దుగుమ్మయు  గ్మలి నవలా చాన
కన్నె బిత్తరి గోతి  కలికి మగువ
జవరాలు చేడియ  జవ్వని తొయ్యలి
నాతి పైదలి యెల  నాగ లేమ
సకియ జక్కవచంటి  చామ చిల్కలకొల్కి
గుబ్బెత ప్రోయాలు  కొమ్మ పడఁతి

పోలఁతి ముద్దియ నన § బోఁడి యింతి మిటారి
నెలఁతుక వాల్గంటి § నెలఁత తెఱవ
తే. యన్ను లతకూన యొయ్యారి § యతివ వెలఁది
చెలియ సకి బోటి కొమరిత § చిగురుబోఁడి
ముగుద వగలాఁడి సింగారి § ముదిత యువిద
గరిత యన భామినీసమా § ఖ్య లగు సాంబ. 20

టీ. చెలి, ముద్దుగుమ్మ=ముద్దులు గులుకునది,ఉగ్మలి, నవలా,చాన, కన్నె బిత్తరి,గోతి,కలికి,మగువ,జవరాలు చేడియ,జవ్వని, తొయ్యలి,నాతి, పైదల,ఎలనాగ,లేమ, నకియ, జక్కవచంటి=చక్రవాకపక్షులమాడ్కి నొండొంటిఁగదిసియుండు స్తనములుగలది,చామ,చిలకలకొలికి= చిలుకలకొలుకులవంటి కంటికొనలుగలది, గుబ్బెత=గుబ్బచన్నులుగలది, ప్రోయాలు, కొమ్మ,పడఁతి,పొలఁతి,ముద్దియ, ననబోఁడి =పుష్పముంబోలు మేనుగలది ఇంతి,మిటారి=మిటారముగలది,నెలఁతుక, వాల్గంటి=నిడుపుకన్నులుగలది, నెలఁత,తెఱ,అన్నులతకూన=లేఁత తీఁగెను బోలినది, ఒయ్యారి=ఒయ్యారముగలది,అతివ,వెలఁది. రూ. వెలఁదుక, చెలియ,సకి (ప్ర సఖి), బోటి, కొమరిత,చిగురుబోఁడి=చిగురువంటి మేనుగలది, ముగుద,వగలాఁడి=వగలుగలది, సింగారి=సొగసుగలది, ముదిత,ఉవిద. గరిత-౫౪ స్త్రీ.

సీ. ఆనవాలును వులు § గంగమచ్చము గుఱు
తడియాల మన లాంఛ § నాఖ్య లౌదవు
జడితి గొబ్బున వేగ § నరగు గ్రక్కున వడి
వేగిర మనఁ దగు § వేగమునకు
మరియాద గడి మేర § సరు దెల్లకర యనఁ
బఱఁగు మర్యాదకు § వెఱఁగు వింత

యక్కజ మబ్బుర § మరిది నివ్వెఱ యబ్ర
మచ్చెరు వన నద్భు § తాఖ్య లమరుఁ
తే. బరఁగు కదలిక పరువన § మెఱయు ధావ
నమ్మునకు వేడె మొనరించెఁ § గ్రమ్మెఁ బొదివెఁ
జుట్టుకొనె నావరించె నా § నిట్టినుడులు
వేష్టనంబున కమరు న § ర్వేశ సాంబ. 22

టీ. ఆనవాలు, పులుగు, అంగమచ్చము, గుఱుతు, అడియాలము-౫ చిహ్నము జడితి (ప్ర. ఝడితి), గొబ్బున, వేగ, సరగు, గ్రక్కున, వడి, వేగిరము - ౭ శీఘ్రము. మరియాద, గడి, మేర, సరుదు, ఎల్ల, కర -౬ హద్దు. వెఱఁగు, వింత, అక్కజము, అబ్బురము, అరిది, నివ్వెఱ(నిం దు+వెఱ), అబ్రము, అచ్చెరువు (ప్ర. ఆశ్చర్యము.)-౬ ఆశ్చర్యము. పరుగు, కదలిక, పరువు-౩ పరుగెత్తుట. వేడెమొనరించె, క్రమ్మె, పొదివె, చుట్టుకొనె, ఆవరించె - ౫ చుట్టును గూర్చుండియుండె.

సీ. బువ్వ మెతుకు కూడు § బోన మోరెము పసా
దము వంటకము వన § దనము బాతు
సాద మోగిర మన § జరుగు నన్నముపేళ్ళు
కుడిచె బోనేసె సా § పడియె నమలె
నారోగిణ మొనర్చె § నారగించె మెసవెఁ
దినె మెక్కె నన భు § క్తి గొనుట కలరుఁ
బనులు చెయ్యాలు సేఁత లనఁ గర్మముల కొప్పుఁ
గనలు మోడి యలుక § కినుక కినక
తే. నాఁగఁ గోపాఖ్య లగు లజ్జ § నాన సిగ్గు
బొసుకు పుయిలోట సిబ్బితి § పుచ్చటి కనఁ

22)

పరఁగు వ్రీడాఖ్య యోల నెపంబు సాకు
నంగ వ్యాజం బమరు జగ | న్నాథ సాంబ 22

టీ. బువ్వ, మెతుకు, కూడు, బోనము, ఓరెము, పసాదము (ప్ర. ప్రసాదము), వంటకము, పసదనము, బాతు (అన్యదేశ్యము), సాదము (ఇది ద్రావిడపదము.) ఓగిరము - ౧౧ అన్నము. కుడిచె, బోసేసె, సాపడియె, నమలె, ఆరోగిణమొనర్చె. రూ. ఆరోగణమొనర్చె, ఆరగించె, మెసవె, తినె, మెక్కె - ౧౦ భోజనము చేసెను. పనులు, చెయ్వులు, చేఁతలు - ౩ కార్యములు. కనలు, మోడి, అలుక. కినుక, కిన్క - ౫ కోపము. లజ్జ, నాన, సిగ్గు, బొసుకు, పుయిలోట, సిబ్బితి, పుచ్చటిక. రూ. పుచ్చడిక - ౮ సిగ్గు, ఓల, నెపము (ప్ర. నిభము.), సాకు - మిష.

సీ. పానుపు తలిమంబు | పఱుపు లేపన మెత్త
సెజ్జ యనఁగ శయ్య | చెలఁగుచుండుఁ
పన్నుండెఁ దెన్నుండెఁ | బండుకొనెఁ బరుండె
బవ్వళించెను బండెఁ | బడక సేసె
నత్తమిల్లెననంగ | నలరారు శయనించె
ననుటకు నిద్దుర | గొనియె గుఱక
గొనియె నిద్ధురపోయెఁ | గూర్కెడి నన నిద్రి
తున కొప్పు లేచె మే | ల్కొనియె మెలకుఁ
తే. వచ్చె నన జాగ్రదభిధాన | మమరు వేడ్క
యెలమి వేడుక సంతోస | ముంపు ముదము
సంతసము సొంపు మే లరు | సం బనంగఁ
బ్రమదమున కాఖ్య లగు జగ | త్పాల సాంబ. 23

టీ. పానుపు. రూ. పాన్పు, తలిమము, పఱుపు, లేపు, మెత్త, సెజ్జ (ప్ర. శయ్య.)-౭ శయ్య. పన్నుండెను, తెన్నుండెను, పండుకొనెను, పరుం

డెను, పవ్వళించెను, పండెను. పడకవేసెను, అత్తమిల్లెను –౭ శయనించె. నిద్దురగొనియె, గుఱకగొనియె. నిద్దురవోయె, కూర్కెడెను–౪ నిద్రించెను. లేచె, మేల్కొనియె, మెలఁకువయ్యె–౩ నిద్రలేచెను. వేడ్క, ఎలమి, వేడుక, సంతోషము, ఇంపు, సుఖము, సంతసము, సొంపు, మేలు, అరు సంబు– ౧౦ సంతోషము.

సీ. పలికె వాక్రుచ్చె న § ప్పనసేసె మందలిం
చెను విన్నవించెఁ జె § ప్పె ననె నాడివె
నాడెఁ బల్కె వచించెఁ § బన భాషణము సేసె
ననుటఁ గా వీనిచ్చె § నాలకించె
వినెఁ జెవియొగ్గెను § వినియె నాలించె వా
క్రుత మయ్యె ననుట కౌఁ § జులుక చౌక
యులక యెల్లిద మన § నొనరు లఘుత పేళ్ళు
పులకలొత్తెను గగు § ర్పొడిచె గగురు
తే. పాటె గరుపాటె మైమోజు § పర్వె ననఁగఁ
దగును రోమాంచనామముల్ § నగవు నవ్వు
నగు న వన హాసమున కొప్పు § నడిమిదిన్న
దివి యాన ద్వీప ముగుఁ బర § దేవ సాంబ. 24

టీ. పలికెను, వాక్రుచ్చెను, అప్పనసేసె (ప్ర.) అర్పణ సేసెను) మందలించెను, విన్నవించెను, చెప్పెను, అనెను, నాడివెను, ఆడెను, పల్కెను, వచించెను– ౧౧ మాట్లాడెను. వీనిచ్చె, ఆలకించె, వినె, చెవి యొగ్గె. వినియె, ఆలించె – ౬ వినెను. చులుకు. రూ. చుల్క, చౌక. రూ. చవుక, ఉలక, ఎలిదము– ౬ లఘుత్వము. పులకలొత్తెను, గగుర్పొడిచె. రూ. గగురుపొడిచె, గగ్గురుపొడిచె, గగురుపాటె. గరుపాటె మైమోజు

పర్వె- ౭ రోమాంచము గలిగెను. నగవు, నగు, నవు- ౩ హాసము. నది మిదిన్నె, దీవి- ౨ ద్వీపము.

సీ. జోత జాఁగిలి కొల్పు । జోహారు గిడిగిడి
మోడుపు చేకూర్పు । మ్రొక్కు మొగుపు
చిన్నపూ చేమోడ్పు । జేజె వెన్నెల చెంగ
నాలు గొబ్బులు టెంక । ణాలు నేరె
డల్లుల్ సలామన । నమరు దండము పేళ్ళ
పళ్ళెము కంచము । పళ్ళెరంబు
తెలె హరివాణంబు । తలియ తట్టె యనంగ
భాజనం బగు గిన్నె । బటుది కోర

తే. డబ్బర యనంగఁ జషక మౌ । దప్పి దూప
దప్పి దగ నీరువట్టన । దాహ మమరుఁ
జాగ మీవి పుడుకు పెట్టు । తేగ మీగి
యనఁగఁ ద్యాగసమాభిఖ్య । లగును సాంబ. 25

టీ. జోత. రూ. జోతము, జాగిలి, కొల్పు, జోహారు. రూ. జోహారువు- జోహారు- జొహారువు, గిడిగిడి, మోడుపు. రూ. మోడ్పు, చేకూర్పు మ్రొక్కు, మొగుపు, చిన్నపూ, చేమోడ్పు, జేజె, వెన్నెల, చెంగనాలు. గొబ్బులు, టెంకణాలు, నేరెడల్లులు, సలాము (ఇది యన్యదేశ్యము.) ౨౩ నమస్కారము. పళ్ళెము. రూ. పళ్యము, కంచము, పళ్ళెరము: తెలె రూ. తెలియ, హరివాణము। తలియ తట్ట ౯ - పాత్రము. గిన్నె; బటుది, కోర; డబ్బర. రూ. దబ్బర- ౫ త్రాగుగిన్నె. దప్పి; దూప; దప్పి, నీరువట్టు-౪ దాహము. చాగము; ఈవి, పుడుకు; పెట్టు, తేగము, ఈగి. రూ. ఈవి-౬ త్యాగము.

సీ. అగపడెఁ జేపడె నబ్బె దొరకెఁ జిక్కెఁ
దగిలెఁ దగుల్కొనెఁ దగులువడియెఁ
బట్టువడియెఁ జిక్కువడెఁ దవిలె ననఁగ
నమరు గృహీతాఖ్య లఱచె నేడ్చె
వాపోయె మొఱలిడె వాచఱచె ననఁగ
రోదనంబున కగు రొద గలిబిలి
చప్పుడు గోల గోల సద్దు కూఁత యులివు
నలుకుడు రవళి యం తనఁగ ధ్వనికి
తే. వలరుఁ గలసెఁ బెరసెఁ గూడె హత్తె దొరసె
నందెఁ బొందెఁ బెనఁగెఁ జెందె నంటె ననఁగ
నమరు సక్తాఖ్య లోనయ్యె నగ్గమయ్యె
లోఁబడె ననంగ స్వవశాఖ్య లుం చను సాంబ. **26**

టీ. అగపడెను (అగ్గము+పడెను,), చేపడెను, అబ్బెను,(దొరకెను చిక్కెను, తగిలెను, తగుల్కొనెను, తగులువడియెను, పట్టువడియెను, చిక్కువడెను, తవిలెను-౧౧ చేతఁజిక్కెను. అఱచెను, ఏడ్చెను, వాపోయెను, మొఱలిడెను, వాచఱచెను-౫ రోదనముచేసెను. రొద, గలిబిలి, చప్పుడు, గోలగోల, సద్దు, కూఁత, ఉలివు, నలుకుడు, రవళి, అంతు-౧౦ శబ్దము కలసెను, పెరసెను, కూడెను, హత్తెను, దొరసెను, అందెను, పొందెను, పెనఁగెను, చెందెను, అంటెను-౧౦ చేరుకొనెను, లోనయ్యెను, అగ్గమయ్యెను, లోఁబడెను- ౩ స్వాధీనమాయెను.

సీ. ఎడసె వీడెను వాసె నెడబాసెఁ బురివిచ్చె
వేఱువడె ననఁగ వెలయుచుండుఁ
బ్రత్యేకమయ్యె నన్ బలుకులు వెడలించె
వెళ్ళగొట్టెను దోలె వెలలఁ బన్నెఁ

దఱిమె రొప్పె ననంగఁ దనరు నుచ్చాటనం
బొనరించె ననుటకుఁ గనియెఁ జూచెఁ
గనుఁగొనెఁ దిలకించెఁ గనెఁ గాంచె ననఁ జెల్లు
దర్శించె ననుటకుఁ దాల్చెఁ బూనె

తే. నానె మోచె ననఁగఁ జెల్లు నధివహించె
ననుట కరికట్టె బోసీక యంకెచేసె
నాఁగె నిల్చెఁ దటాయించె నడ్డగించె
నానుకొనె ననఁ దగు వారణాఖ్య సాంబ 27

టీ. ఎడసెను, వీడెను, పాసెను, ఎడఁబాసెను, పురివిచ్చెను, వేఱుపడెను-ఇ ప్రత్యేకమాయెను, వెడలించెను, వెళ్ళఁగొట్టెను, తోలెను, వెలుఁదిన్నెను, తఱిమెను, రొప్పె-ఇ తఱుమఁగొట్టెను. కనియెఁ, చూచెఁ, కనుఁగొనెఁ, తిలకించెఁ, కనెఁ, కాంచెఁ -ఇ వీక్షించెను. తాల్చెను. పూనెను, అనెను మోచెను -ఈ ధరించెను. అరికట్టెను = చుట్టునిలిచెను, పోసీకయంకె చేసెను, ఆఁగెను, నిల్చెను, తటాయించెను, అడ్డగించెను, అనుకొనెను-ఇ నివారించెను-నిరోధించెను.

సీ. అంటుగాఁ గొనియె ముట్టయ్యెఁ జెలఁగుమాసెఁ
గడకేఁగె నింటికిఁ గాకపోయె
ననఁగ దూరస్థకు దనరుఁ దానముచేసె
నీళ్ళుపోసికొనె ము నిండఁ గ్రుంకెఁ
నన నిమజ్జమయ్యె ననుటకుఁ దగుఁ మఱి
మడుఁగు మడు వనంగ నడరు శుచికి
మైలకట్టువిడుపు మాఁ వన మలినాఖ్య
లగు దల్పు వాకిలి యనఁ గవాట

తే. మునక లొనరు నేకతంబు మంతన మనంగ
నంతరంగమునకుఁ జెల్లు నక్కఱ వని
యంబలియు జావ యనఁ గార్య మొనరు గంజి
వార్చిన యవాగునామముల్ వఱలు సాంబ. 28

టీ. అంటుగైకొనియె, ముట్టయ్యెన్, చెఱఁగుమాసెఁ, కడకేఁగెఁ ఇంటికిఁగాకపోయెఁ-౫ బహిష్ఠయాయెను. తానముచేసెను, నీళ్ళుపోసికొనెను, మునింగెను, క్రుంకెను-౪ స్నానమొనర్చెను. మడి, మడుఁగు, మడుగు-౩ పరిశుద్ధి (మడుఁగుదోవతి). మైల రూ. మయిల, కట్టువిడుపు, మాపు-౩ మైల, (మైలగుడ్డ). తల్పు. రూ. తలుపు, వాకిలి-౩ కవాటము. ఏకతము, మంతనము-౨ యవాగువు.

సీ. ఒకటి యొక్కఁ డొకండు నొండన నేకాఖ్య
జమి డిమ్మ డిబ్బడి జంట రెండు
దుగ రెట్టి దువ యన ద్విగుణాఖ్య కవ జోడు
దంట దోయి యనంగ ద్వంద్వసంఖ్య
మూఁ రెండొకటి తిగ మూడనఁ ద్రయసంజ్ఞ
చౌ యుడ్డ తీవంచ చౌకము నలు
వాలు గనఁగఁ జతుర్నామముల్ చౌవంచ
యరవది యేను నై దనఁగఁ బంచ

తే. కంబు నాఱుటిత్తిగ యన షట్కంబు చక్కఁ
బగడ సత యే డనంగ సప్తకము దచ్చి
యెనిమి దన నష్టకము తొమ్మి దనఁగ నవము
పదియు నీరై దన దశాఖ్య పరఁగు సాంబ. 29

టీ. ఒకటి,ఒక్కఁడు,ఒకండు, ఒండు-౧ ఏకసంఖ్య. జమిడి. రూ. జమిలి, ఇమ్మడి. రూ. ఇనుమడి, ఇబ్బడి,జంట,౹రెండు, దుగ, రెట్టి, దువ-౧౦ ద్విసంఖ్య. కవ, జోడు, దంట-దోయి – ౪ జత-మిథునము. మూ, రెండొకటి, తిగ, మూఁడు-౪ త్రితయము-త్రిసంఖ్య. చౌ, ఉడ్డ, తీవంచ, చౌకము, నలు, నాలుగు-౬ చతుష్టయము. చౌవంచ, అరపది – పదిలో సగము, ఏను, ఐదు. రూ. అయిదు—౪ పంచసంఖ్య-పంచకము.ఆఱు,ఇత్తిగ (ఇరు+తిగ)-౨ షట్సంఖ్య-షట్కము. చక్కపగడ,సత. (ప్ర. సప్త) ఏడు-౩ సప్తసంఖ్య-సప్తకము. దచ్చి, ఎనిమిది-౨ అష్టసంఖ్య-అష్టకము. తొమ్మిది-౧ నవసంఖ్య. పది, ఈరైదు=రెండు అయిదులు—౨దశసంఖ్య—దశకము.

సీ. పదునొకం డనఁగను బరఁగు నేకాదశం
బీరాఱు పండ్రెండు బార యనఁగ
దవిసంఖ్య యగు నానఁ ద్రాగెఁ ద్రావెను గ్రోలె
ననఁగఁ బానముచేసె ననుట కొనరు
బనివినియెను బోయెఁ జనె నేఁగె నరిగె నాఁ
గృతగమనునకుఁ బేర్వెలసెఁ గ్రమ్మ
ఱించెఁ ద్రిప్పెను మగి డించె మరల్చె నా
నావర్తన మొనర్చె ననుట కొనరుఁ
తే. బాఱె వెళ్ళెను బరువెత్తెఁ బఱచెఁ గదలె
నుఱికెఁ దొలఁగె నటమరించె జరిగె ననఁ బ
లాయితుం డయ్యె ననుటకు నలరుచుండు
సకలసురచక్రవర్తి శ్రీ సాంబమూర్తి. 30

టీ. పదునొకండు-౧ ఏకాదశసంఖ్య. ఈరాఱు=రెండుఆఱులు, పండ్రెండు, బార-౩ ద్వాదశసంఖ్య. ఆనెను. త్రాగెను, త్రావెను, క్రోలెను-౪ పానముచేసెను. పనిపినియెను, పోయెను, చనెను, ఏఁగెను, అరిగెను-౫కృత

గమనుండయ్యె. క్రమ్మఱించెను, త్రిప్పెను, మగిడించెను, మరల్చెను-౪ నివృత్తిచేసెను. పాఱెను, వెళ్ళెను,పరువెత్తెను,పఱచెను,కదలెను,ఉఱికెను, తొలఁగెను, అటమరించెను, జరిగెను-౬ పలాయితుఁడయ్యెను.

సీ. గడుసరి దిట్ట యె ♦ క్కటి వాఁడిగలవాఁడు
వడికాఁడు పోటరి ♦ బంటు మేటి
మనసరి తెంపరి ♦ మొనకాఁడు మిడిమాసి
వడివాఁ డనంగ శూ ♦ రుఁడు సెలంగు
నని చివ్వ యేదైఱ ♦ యాలము బవరము
పోట్లాట పెనఁకువ ♦ పోరు కలను
కయ్యము దురము జ ♦ గడ మన యుద్ధాఖ్య
లమరు మద్దత్తు వె ♦ న్నాస తోడు
తే. పాటు సావాసము వరాలు ♦ చౌపట యన
రాజిలు సహాయమునకును వే ♦ రమ్ము కంటు
సూడు పగ దేస మనఁగఁ బొ ♦ ల్చును విరోధ
నామములు సర్వలోకైక ♦ నాథ సాంబ. 31

టీ. గడుసరి, దిట్ట, ఎక్కటి, వాఁడిగలవాఁడు, వడికాఁడు, పోటరి, బంటు, మేటి, మనసరి, తెంపరి, మొనకాఁడు, మిడిమాసి, వడివాఁడు-౧౩ శూరుఁడు. అని, చివ్వ, ఏదైఱ, ఆలము, బవరము, పోట్లాట, పెనఁకువ, పోరు, కలను, కయ్యము(ప్ర. కలహము.), దురము, జగడము-౧౨ యుద్ధము. మద్దత్తు, వెన్నాస, తోడుపాటు, సావాసము, వరాలు, చౌపట-౬ సహాయము, వేరము, కంటు, సూడు, పగ, దేసము-౬ విరోధము.

సీ. నులిచి వెంపరలాడె ♦ నుగ్గాడెఁ దెగటార్చెఁ
జక్కాడెఁ బగదెంచెఁ ♦ జంపెఁ జెండె

సదమదమొనరించెఁ జదిపెఁ బీచమడంచె
నులిమెఁ జాఁగఁబలాడెఁ బిలుకుమార్చెఁ
బరిమార్చె ముగియించె నుణ్ణముసేసె నడఁచె
ద్రుంచెఁ బొగరుమార్చెఁ దునిమె మడిపె
మన్నిగొనియె రూపుమాపె గీటడఁగించె
మడియించెఁ దూలించె మలిపె ననఁగఁ
తే. బొనఁగు వధియించె ననుటకుఁ బ్రోచెఁ బ్రోవె
సాఁకెఁ గాపాడె బ్రతికించె నంతరించెఁ
బెంచె మనిపె ననఁగను బోషించుట కగు
సుకలసురచక్రవర్తి శ్రీసాంబమూర్తి. 32

టీ. సులిచెన్, వెంపరలాడెన్, నుగ్గాడెన్, తెగటార్చెను, చక్కాడెను, పగదెంచెన్, చంపెన్, చెండెన్, సదమదమొనరించెను, చదివెను, పీఁచమడఁచెన్, నులిమెన్, చాఁగఁబలాడెను, పిలుకుమార్చెను, పరిమార్చెను, ముగియించెను, నుఱుముసేసెను, అడంచెను, త్రుంచెను, పొగరుమార్చెను, తునిమెను, మడిపెను, మన్నిగొనియెను, రూపుమాపెను, గీటడంచెను, తూలించెను, మలిపెను—౨౭ సంహరించెను, ప్రోచెను, ప్రోవెను, సాంకెన్ కాపాడెను, బ్రతికించెన్, సంతరించెన్, పెంచెన్. రూ. పెనిచెన్, మనిపెన్ రూ. మనిచెన్, మంచెన్ — ౧౧ రక్షణమొనర్చెను.

సీ. ఇచ్ఛ తలఁపు మది యెద మన సనఁ జిత్త
మగుఁ దమకము మేలు మరులు బాళి
తమి వలపు విఱాళి మమత నా మోహ మా
నాఁడాది యదిసుత నాఁట, బట్టి యా
నాఁడునిఁక యది మొదల్ నాఁటఁగోలె

యనఁగ దదారభ్య § యనుట కా మంచి మేల్
బాగు లెస్స యన శు § భంబు లలరు
తే. వనట యంగలారుపు వెత § వంత గోడు
బాధ యంగద వగ పనఁ § బరంగుఁ బీడ
పదవి సిరి కల్మి యనఁగ సం § పదకు వెలయు
నితము పేరి మిం పన హిత § మెనఁగు సాంబ. 33

టీ. ఇచ్ఛ, తలఁపు, మది, ఎద, మనసు (ఇది తత్సమముగానున్నది)-౫ చిత్తము. తమకము, మేలు, మరులు, బాళి, తమి, వలవు, విరాళి, మమత (ఇది తత్సమము.)-౮ మోహము. నాఁడాది, ఆదిసుత, నాఁటినుండి, తల నాఁడు, నాఁడు మొదలు, నాఁటఁబట్టి, అనాఁడునిక్క, ఆది మొదలు. నాఁటఁ గోలె-౯ ఆదినము మొదలుకొని. మంచి, మేలు, బాగు, లెస్స—౪ శుభము వనట, అంగలారుపు, వెత, వంత, గోడు, బాధ (ప్ర. బాధ.), అంగద, వగపు—౮ పీడ-నొప్పి. పదవి (తత్సమము), సిరి, కల్మి. రూ. కలిమి-౩ సంపద. ఇతము, పేరిమి, ఇంపు -౩ హితము.

సీ. జలపీడ నెడసె నాఁ § జను విరహము పేరు
లెనసెఁ బైకొనఁ బొందె § నేలెఁ గలసె
సన సంగము మొనర్చె § ననుట కౌఁ బొలయల్క
వెడమోడి యనఁ బేళ్ళ § వెలయుఁ బ్రణయ
కలహమునకు జడ § గాంజ గంజా బంగి
యనఁగఁ గళంజాహ్వ § యంబు లలరు
మబ్బు లాహిరి కైపు § మస్తన మత్తత
ఖాసిల్లుఁ దోడుసు నం § పడ మనంగ
తే. భోగవనితకుఁ దగుఁ దెంపి § ముసుకు కుంక
మాసక మ్మన విధవనా § మములు సెలఁగు

భైరవాసంబు దోవతి । పంచె యనఁగ
నిల బహిర్వాసాఖ్య । లలరు సాంబ. 34

టీ. జతవీడెఁ, ఎడసెఁ-౨ వియోగము నొందెను. ఎనసెన్, పైకొనెన్, పొందెన్, ఏలెన్, కలసెన్-౫ సంగమించెను. పొలయలుక, పెడమోడి -౨ ప్రణయకలహము. జడ, గాంజ, గంజా; బంగి-౪ కలంజము. మబ్బు లాహిరి, కైపు, మస్తు-౪ మత్తు. తొడుసు, ఉంపడము-౨ ఉంచుకొన్నస్త్రీ తెంపి, ముసుకు, కుంక, మానకమ్మ-౪ విధవ. భైరవాసము. రూ. బయిరవాసము, దోవతి; పంచె-౩ పయివస్త్రము.

సీ. విచ్చేసె నేతెంచె । వచ్చెను వేంచేసె
నరుదెంచెఁ జనుదెంచె । ననఁగ నాఁగ
తునిపేరు లగు మగ । తనము మగంటిమి
గండనఁ బౌరుషా । ఖ్యలు చెలంగు
గద్దించె నదలించె । గదిమెను నుఱిమె నా
గర్జించె ననుట కౌ । గట్టి యుక్కు
చేగ యూట యుదుటు । చేవ యఱవు బిగు
వన దృఢత్వము పేరు । లలరు జట్టి
తే. విలువ రో వెల యనఁ గ్రయా । ఖ్యలు దనర్చుఁ
గ్రపమ సిరఁబు గంబూర । కప్పుర మన
వెలయుఁ జంద్రంబు వెలిగ్రుక్క । గిలుగు పలుకు
రపవలు కనంగ మణితాఖ్య । లవును సాంబ 35

టీ. విచ్చేసెను, ఏ తెంచెను. రూ. ఏగుదెంచెను, వచ్చెను, వేంచేసెను అరుదెంచెను. రూ అరుగుదెంచెను, చనుదెంచెను-౮ అగతుఁడయ్యె. మగతనము, మగంటిమి, గండు - ౩ పౌరుషము. గద్దించెను, అదలించెను, గదిమెన్, ఉఱిమెను-౪ బెదరించెను. గట్టి, ఉక్కు, చేగ, ఊట, ఉదుఱు, చేవ,

ఉలువు, బిగువు-౨ దార్ఢ్యము. జట్టి, విలువ. రో, వెల-౪ మూల్యము-క్రయము. కప్రము, సిరము, గంబూర. రూ. గంబూరము, గంబురము, గంబుతా, కప్పురము. రూ. కపురము-౭ కర్పూరము. వెలిగ్రుక్క, గిలుకు పలుకు, రసపలుకు-౩ రతికూజితము.

సీ. లేమి పేదరికము లేమిడి లేవడి
నిప్పచ్చర మిడుమ నెవ్వ యనఁగ
దారిద్ర్యనామముల్ తగు దెన యాత్రము
కడగండ్లు గోరము కస్తి జెడఁద
యడలు చేటన విప దాఖ్యలు వర్తిల్లుఁ
డెక్కెమెగురఁగొట్టె ఊంకవేసెఁ
బెద్దనిద్దురవోయె బిద్దె మడిసెఁ జచ్చెఁ
జనె గంతుకొనెఁ ద్రుంగె సమసె నేగెఁ
తే. కూలె నీల్గెఁ గెడసెఁ ద్రెళ్లెఁ గ్రుంకె బ్రుంగె
దెరలెఁ బోయె ముగిసెఁ దేఱెఁ దొఱఁగె ననఁగ
బరఁగు మృతినిసమాఖ్యలు బవిరి చుట్టు
వేడెమున వలయాభిధల్ వెలయు సాంబ 35

టీ. లేమి, పేదఱికము [పేద+ఱికము-భావార్థకతద్ధితము], లేమిడి లేవడిఁ నిప్పచ్చరము, ఇడుమ, నెవ్వ-౭ దారిద్ర్యము, దెన, ఆత్రము. రూ. ఆత్తరము. కడగండ్లు [నిత్యబహువచనాంతము], గోరము, కస్తి, జెడఁద, అడలు, చేటు-౬ ఆపత్తు. డెక్కెమెగురఁగొట్టెన్. ఊంకవేసెన్, పెద్దనిద్దురవోయెన్, బిద్దెన్. మడిసెన్, చచ్చెన్, చనెన్, గంతుకొనెన్, త్రుంగెన్, సమసెన్, ఏగెన్, కూలెన, నీల్గెన్, కెడసెన్, త్రెళ్ళెన్. క్రుంకెన్, బ్రుంగెన్, తెరలెన్, పోయెన్, ముగిసెన్, తేఱెన్, తొఱఁగెన్-౨౨ మృతిపొందెను. బవిరి, చుట్టు. వేడెము-౩ వలయము.

సీ. గమి పౌఁజు మొత్తము । కదుపు చేరువ బారు
పిండు కూటువ పరి । దండు దిమ్ము
గుంపు తుటుము గుమి । గూటు పదు పసంగ
బృందాఖ్యయగు వెళ్లె । వెడలె వెలలె
వెలువడె ననఁ బేళ్ళు । వెలయు నిర్గతుఁ డంట
కెన్నఁడు వాలాయ । మెపుడు నిచ్చ
లెల్లప్పు డెప్పటి । కేప్రొద్దు నెడపకే
నా డెప్పు డుడుగక । నాఁ జెలఁగు

తే. సంతతాఖ్య కొలము వంగ । సమ్ము వంగ
డమ్ము ననఁ గులాఖ్య వర్తిల్లు । గ్రమ్మఱ మఱి
మగుడ వెండియుఁ బలుమఱు । మరల సారె
తిరుగ ననఁ బునరాఖ్యలు । బరగు సాంబ 37

టీ. గమి, పౌఁజు, మొత్తము, కదుపు, చేరువ, బారుపిండు, కూటువ, పరి, దండు, దిమ్ము. గుంపు, తుటుము, గుమి, కూటు, పదుపు-౧౭ సమూహము. వెళ్ళెన్, వెడలెను. వెలలెన్, వెలువడెన్-౪ ప్రయాణమయ్యెను. ఎన్నఁడు, వాలాయము, ఎప్పుడు, ఉడుగక-౧౧ సతతము-సదా, కొలము, వంగసము, వంగడము-౩ వంశము. క్రమ్మఱ, మఱి. మగుడన్, వెండియున్, పలుమఱు, మరల, సారె, తిరుగన్-౮ మాటిమాటికి.

సీ. పండ కోఁచ పిటికి । సాలుంబో తనఁగను
సుమదభీరుని పేరు । లమరుచుండు
విడియము వీడెంబు । వీడ్యము వక్కాకు
తములము బాగాలు । తమ్ములంబు

నాఁ జనుఁ దాంబూల నామముల్ గొనియాడె
నగ్గించెఁ బొగడెఁ గొండాడె నెంచెఁ
గైవారమొనరించె నా వినుతికిఁ బేళ్ళు
క్రచ్చు కోరిక కోర్కి యిచ్ఛ యనఁగ

తే. నిచ్చ కగు రోసెఁ బరికించె నెమకెఁ దడవె
వెదకె నారసె నరసెను వెతకె ననఁగ
దనరు నన్వేషణాఖ్యలు తన్నెఁ దాఁచె
నడుగు తాటించెఁ గాళ్ళచే నడిచె ననఁగఁ
నమరుఁ బదతాడనాభిధానములు సాంబ. 38

టీ. పంద, కోఁచ, పిఱికి, పాఱుఁబోతు (పాఱు+పోతు)-లు యుద్ధమునకు వెఱచువాఁడు. విడియము-రూ. విడెము, వీడెము, వీడ్యము వక్కాకు (వక్కలు+ఆకులు.), తమలము, బాగాలు, తమ్ములము-లు తాంబూలము కొనియాడెను, అగ్గించెను, పొగడెను, కొండాడెను, ఎంచెను, కైవారమొనరించెను - ను స్తోత్రముచేసెను. క్రచ్చు, కోరిక, కోర్కి, ఇచ్ఛ - లు ఆపేక్ష. రోసెను, పరికించెను, నెమకెను, తడవెను, వెదకెను. అరసెను, అరసెను, వెతకెను-లు అన్వేషించెను, తన్నెన్ తాఁచెను, అడుగుతాటించెను, కాళ్ళచేనడిచెను-లు కాళ్ళతోఁ దన్నెను.

సీ. కొమరు చొక్కటమ్ము గొనబు చొక్కారము
చొక్కము మేలిమి జోఁక పొలుపు
నాణెంబు సొరు వి న్నాణంబు తిన్నన
బరఁగు చొక్కు చెల్వ మురువు తనరు
నగు తియ్య పొనరు చె న్నలరు నలువు, తీరు
వఱలు జాను చెలంగు కొఱలు నొనరు

చను తగు నొప్పు నె § నంగు ననెడు పేళ్ళ
తగు మంజులమునకు § దండ యొద్ద

తే. చెంత కుఱఁగలి దగ్గఱ § చేర్వ పొంత
దాపు సరస కెలను పజ్జ § ప్రాపువద్ద
యండ చక్కి గరిడి యన § నమర నౌ స
మీపనామములు మనోజ్ఞ § రూప సాంబ. 39

టీ. కొమరు, చొక్కాటమ్ము. రూ. చొకాటము, చొక్కటము, గొనబు, చొకారము. రూ. చొక్కారము, చొక్కము, మేలిమి, జోఁక, పొలుపు, నాణెము. రూ. నాఁడెము, సొరు, విన్నాణము, తిన్నన, పరఁగు చొక్కా. రూ. చొక్క, చొకా, చెల్వు. రూ. చెలువు, మురువు, తనరు, నగు, తియ్య, పొనరు, చెన్ను, అలరు, నలుపు, తీరు, వఱలు, జాను, చెలఁగు, కొఱలు, ఒనరు, చను, తగు, ఒప్పు, ఎనఁగు - ౪౦ అందమైనది. దండ, ఒద్ద, చెంత, కుఱఁగలి, దగ్గర, చేర్వ. రూ. చేరువ, పొంత దాపు, సరస. కెలను, పజ్జ (ప్ర. పశ్చాత్.), ప్రాపు, వద్ద, అండ చక్కి, గరిడి-౧౮ సమీపము.

సీ. పిమ్మటఁ దరువాతఁ § బిదప వెనక వెనుక
ననఁగఁ బశ్చాదభి § ఖ్యలు చెలంగు
సడలె వదలె ప్రీలె § జాఱె వీడె ననంగఁ
జ్యుత సమాఖ్యలగు లొ § చ్చు కొద కడమ
కుఱుచ యొచ్చెము తగ్గు § కొంచెము తక్కువ
కుందు కొదువ లోను § కొద్ది యనఁగ
మెఱయు న్యూనత పేళ్ళ § మిక్కిలి యెక్కువ
యెచ్చు పెల్లిదనము § పెచ్చు మిగుల

తే. హెచ్చనంగ నధికాభిఖ్య । లెనఁగుచుండుఁ
దొలుత ముందర మున్ మున్ను । తొల్లి మునుపు
ముందు మును తొలి యనఁ జనుఁ । బూర్వమునకుఁ
దడవు జాగన నాలస్య । సాంబ. 40

టీ. పిమ్మట౯, తరువాత౯,(తరువాయిశబ్దమునకు సప్తమ్యేకవచనము.)పిదప౯, వెన్క, వెనుక-౫ అనంతరము. సడల౯, వదల౯, పదల౯, ప్రీల౯, జాఱ౯ వీడ౯-౫ అవలంబించెను-చ్యుతమయ్యెను, లొచ్చు, కొఱ, కడమ, కుఱుచ, ఒచ్చెము, తగ్గు, కొంచెము, చుక్కువ, కుందు, కొఱవ, లోను, కొద్ది-౧౨ స్వల్పము - న్యూనత్వము, మిక్కిలి, ఎక్కువ, ఎచ్చు. పెల్లుధనము, పెచ్చు, మిగుల, హెచ్చు-౮ అధికము. తొలుత, ముందర, మున్, మున్ను, తొల్లి, మునుపు, ముందు, మును. తొలి—౯ పూర్వము. తడవు, జాగు-౨ ఆలస్యము,

సీ. తాఱుమాఱయ్యెను । దడఁబడె వీడ్వడె
  నన విపర్యాసాఖ్య । లమరు సాము
సగము సాఁబా లనఁ । దగు నర్ధ మనుటకు
  దూఁకొనెఁ జొరఁబాఱెఁ । దగునర్ద మనుటకు
ననఁగఁ బ్రవేశించె । ననుటకుఁ దనరారు
  మొత్తెఁ గొట్టెను వ్రేసె । మోఁదె ననఁగఁ
బ్రహరించె ననుట కౌఁ । బనిచె ననిచెఁ బుచ్చె
  నంపెఁ బుత్తెంచెఁ బో । మ్మనియెఁ బంపె
తే. గెలుపుమనె ననఁ బ్రస్థితా । ఖ్యలు చెలంగుఁ
జాయపొంతనఁ జో టనఁ । బాయ యిక్క
చక్కి తా ననఁగఁ బ్రదేశ । సంజ్ఞ దనరు
నంబరనదీలసత్కటా । డంబ సాంబ. 41

